# వేదవేదాంగచంద్రిక

గ్రంథకర్త:

మహాకవి శిరోమణి,

బ్ర॥ చివుకుల అప్పయ్యశాస్త్రిగారు.

సంపాదకుడు:

నీలా రాజయ్య గుప్త

మొదటికూర్పు 1000.

ప్రకాశకులు:

చందా నారాయణ శ్రేష్ఠి,

పబ్లిషర్సు, బుక్ సెల్లర్సు,

జనరల్ బజారు,

శికింద్రాబాదు.

శ్రీబాలాత్రిపురసుందరీ ముద్రాక్షరశాలా ముద్రితము

శికింద్రాబాదు

సర్వస్వామ్య సంకలితము] 1934. [వెల. 1-0-0

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణే నమః.

# INTRODUCTION.

The author of this little booklet "Veda Vedanga chandrika" has sought to establish within a small compass in clear and readable Telugu, the main principles of the authority on which our Sacred Literature is based and their importance as a useful study in regulating life and conduct with the ideal of Sanatana Dharma. A book like this is most welcome at a time when the ancient Hindu Religion is once again on its trial and is assailed on all sides from within as well as without. The author is a reputed scholar and Pandit and has achieved his task remarkably well. Sanatana Dharma withstood bravely several tempests in the past and none could be more severe than the tornadoes of Jainism and Budhism and even Kapila Sankhya. The relentless logic of these faiths was refuted by the great sages of the past, like the Immortal Sankaracharya and others and the revealed text of the Vedas and the Upanishads stood vindicated in all its glory as the ultimate authority before the minds of all right-thinking men. A little deep reflection, unbiassed by passion or prejudice, on the ultimate Reality of things, cannot fail to carry that conviction to all thinking minds wherein all doubts stand dissolved and

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

Truth stands revealed in all its Native Effulgence. A reverent study of the ancient Scriptures with a course of life guided by faith and purity, are a necessary preparation for the reception of that Great Truth which can be imparted by the Guru alone. ఆచార్య వాన్ పురుషోవేద. The tendency nowadays is to decry Hinduism based on the Vedic and Sastraic texts and to attribute to it all the political, economic and other miseries from which the nation is sufferring; the Orthodox Brahmin as the follower and expounder of those Sacred writings goes in for a lot of unnecessary abuse from others on his devoted head. The socalled Slavery of the Country and even divine visitations like the recent devastating earthquake; are attributed to the Caste system, than which there could be no more mischievous or more sinful invention, in the eyes of the reformers, ever evolved out of the crafty brains of the priestly class. This is no place for the vindication of that system but mention must be made that sociological philosophers and thinkers are not wanting who bestow their unstinted and well-deserved praise on it. The attempts of the modern reformers are therefore chiefly guided towards subverting that system. Extravagant claims are made that reformers far outnumber the Sanatanists. Such ideas can be easily dispelled

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

by a little reflection that the Sanatanist is by Culture and Temperament not vociferous but seeks to carry on his life in an unobtrusive manner and unobstructed by others. Live and let live is his motto. Even the few of the Avarnas who attained the Sainthood, in India do not seem to have decried the caste system or repudiated the authority of the Vedas. The Metaphysical equality to be attained by the austere Yogin after severe course of penance and rigid discipline, transcending all duality and realising the Universal Self, is sought to be brought down to the plane of practical life by the reformers. Sanatana Dharma itself proclaims that for such an Avadhuta, an Atyasrami there is and need be no caste distinction or rigour of caste discipline. Only everyone cannot attain that position. The slightest touch of self or worldly desire will drag such a sage down. The essential divinity of human nature is recognised by that sastras but at the same time inequalities do exist as hard facts of worldly experience which can only be explained as due to Karma, with-out attributing partiality or prejudice to God in Creation. Even Biological Science recognises that it is the "Gene" which determines the character of the individual life. A mango seed produces a mango tree and if it can produce a different kind of tree, the pheno-

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

menon can only be described as magic or as the result of the inscru table Sakti of the Iswara. India alone is karma bhumi. The restrictions in our march towards the True Goal are therefore found here alone.

The upadhi is determined by the Karma and it has to be shed; if the Eternal Spirit should shine resplendent in its natural lustre. Fire exists in wood, stone, air and even in water (of the sea.) How difficult it is to extract it from such materials. It also exists in the earth and in the air. Its terrible manifestations in the shape of volcanoes and thunderstorms are experienced by the millions but how many can know and realise that fire is universal and that it exists in terrestial, atmospheric, and celestial, forms as taught in the Veda and that fire is the first among the Gods created by Prjapathi. Modern science following the Nebular theory recognises the fire element as the one out of which the sun, planets, stars etc have evolved and are evolving. అగ్నిందేవతానాంప్రథమ మసృజత అగ్నిర్దేవానామవమః విష్ణుః పరమః తత్తేజోఽసృజత ! తత్తేజ ఐక్షత. etc. The Karma Kanda is based on such religious philosophy, eg., ఆగ్నావైష్ణవ మేకాదశకపాలం నిర్వపతి. అగ్నావిష్ణూసజోష సేమావర్ధంతు వాంగిరః ఆగ్నేయ మష్టాకపాలం, వైష్ణవం త్రికపాలం. For Agni 8 Kapalams and Vishnu three, total eleven, so

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

that between the two ends, the whole hierarchy may be embraced. The Karma Kanda and its relation to the Jnana Kanda is too vast a subject, to be touched upon here. All that need be said is that our ancient Scriptures and institutions deserve a reverant and careful study, not only by individuals but learned associations of Scholars with varied learning, to verify and realise those Eternal Truths. Human reason and Judgment however high and eminent cannot be free from those infirmities errors, and Himalayan blunders, to which it is naturally subjeet and the ultimate refuge the haven of peace and bliss, must be sought in the Revealed Text. తమేవం విద్వానమృత ఇహాభవతి. నాన్యః పంథా అయనాయ విద్యతే This has been clearly emphasised in the Brahmasutra. « తర్కాప్రతిష్ఠానాత్ " and the comentaries thereon. Such an insistance is not to dwarf or enslave the individual intellect or judgcment as many may eroneously think, but to guide it in its methods of highest reasoning so as to gain the conviction, born of direct realisation, attuning our thoughts with those of the Shining Ones who have gone before and became One with the Enternal Light. If our boys are made to study such books early and imbibe the habits of thought embodied therein, the spectacle of a soulless and denationalised education will not be their heritage ; and

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

a vigorous nnd youthful generation proud of its past confident of the present and hopeful of the future will certainly arise to uphold and justify Aryan culture before the Enlghtened World.

*Prabhala Lakshmi Narasimham,*
B. A., B. L.
**Advocate.**

*Dated 5th May 1934,*
VIZAGAPATAM.



CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative



# అవతారిక.

శ్లో॥ యం పృథ గ్ధర్మాఽచరణాః
పృథ గ్ధర్మాభిలాషిణః
పృథ గ్ధర్మై స్సమర్చన్తి
తస్మై ధర్మాత్మనే నమః.

ప్రపంచమునందు దుర్లభమగు నరజన్మ మెత్తినందులకుఁ బురుషార్థములను సంపాదించి కృతార్థతఁ జెందుట ముఖ్యమైయున్నది. ఈపురుషార్థములు ధర్మము, అర్థము, కామము, మోక్షములని నాలుగు. వీనికన్నిటికి మూలకారణము ధర్మము. కనుకనే పెద్దలిద్దానిని బ్రథమమునఁ బరిగణించిరి. ఇది చక్కఁగా నవలంబింపని యెడలఁ గడమ పురుషార్థములు మూఁడు సిద్ధింపనేరవు. ఇది యైహికాముష్మికసుఖప్రదంబు. ఇది లోకములను ధరించుట వలనగాని, లోకులచే ధరింపఁబడుట వలనగాని ధర్మమని యనఁబడును. మఱియు ధర్మశబ్దమును గూర్చి యనేకమహర్షు లనేకవిధములుగా నిర్వచించియున్నారు. ఎవరెట్లు చెప్పినను మొత్తముమీఁద ననిష్టమును బరిహరింపఁ జేసి యిష్టమును సాధింపఁజేయునది "ధర్మము" లేక "శాస్త్రవిధి" యని తేలును.

దీనికి వ్యతిరేకమయినది యధర్మము. ప్రవృత్తిధర్మము, నివృత్తిధర్మము, సామాన్యధర్మము, విశేషధర్మములను భేద

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

ములతో ధర్మము పలురకములం జెప్పబడినది. ఈ ధర్మా ధర్మములను నిర్ణయించునవి వేదశాస్త్రంబులు. ఇందువలన ధర్మమును శాస్త్రవిధి యనికూడఁ జెప్పవచ్చును.

ఈ ధర్మము లేక శాస్త్రవిధి నుల్లంఘించి స్వేచ్ఛగా సంచరించువారు కార్యసిద్ధినిగాని సుఖమునుగాని, సద్గతిగాని పొందనేరరని భగవద్గీత నుడువుచున్నది. శాస్త్రములనఁగా ఋగ్యజుస్సామాథర్వణములను నాల్గువేదములు, శిక్షలోనగు నాఱు వేదాంగములు, న్యాయ, వైశేషిక, సాంఖ్యాది సప్తదర్శనములు, అష్టాదశపురాణములు మున్నగునవియై యున్నవి.

ఈశాస్త్రములందు వైదిక నైతిక యౌగిక రాజకీయార్థి కాద్యనేక గహనవిషయంబులు గలవు. ఇవి యాంధ్రభాషలో లేక సంస్కృత భాషయం దుండుటంబట్టి సంస్కృత భాష నభ్యసింపని యిక్కాలపువారికి ముఖ్యముగా విద్యార్థులకు దురవగాహంబులుగా నుండె. అందుచే మనయాంధ్ర విద్యార్థులకుఁగూడ నాశాస్త్రములందలి విషయంబులు సులభంబుగా బోధపడుపవలెనను భావముతో "వేదవేదాంగ చంద్రిక" యనెడి యీ చిన్నిగ్రంథమును వ్రాసితి. ఇందు వేదములను గూర్చియు, వేదాంగములను గూర్చియు నందలి విషయము లను గూర్చియు వ్రాయఁబడినది. ఇది యిప్పటి విద్యార్థులకుఁ జక్కఁగా నుపకరింపఁ గలదని నాయాశయము. నాయీ ప్రయ

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

త్నము భాషాభిమానుల యాదరణమునకుఁ బాత్రమగునేని "దర్శనదర్పణ" మను పేరంబరగు మరియొక చిన్నికబ్బమును గొలదికాలములోఁ బ్రకటింపఁగలను. ఇందు, న్యాయ, వైశేషిక, యోగ, సాంఖ్య, దైవీ, కర్మ, బ్రహ్మ మీమాంసా దర్శనంబులం గూర్చియు వానియందలి విషయంబులంగూర్చియు వ్రాయఁబడినది.

ఈ పుస్తకమునకు శ్రీకాశీక్షేత్రములోని భారతధర్మ మహామండలి కధ్యక్షులును, సనాతన వర్ణాశ్రమధర్మప్రచారకాగ్రగణ్యులును, బహుళోద్గ్రంథ ప్రణేతలును నగు శ్రీశ్రీ స్వామి దయానందజీ మహారాజులు (బి. ఎ.) గారిచే రచింపఁబడిన "సత్యాఽసత్యార్థ వివేక" మను హిందీగ్రంథములోని యొకకొంతభాగము మాతృకయై యున్నది.

ఏతన్మాతృకా గ్రంథకర్తలగు శ్రీస్వాములవారికిని, దమ శరీరాస్వాస్థ్యమును గూడ సరకుసేయక చక్కని యాంగ్లపీఠిక వ్రాసి యీ గ్రంథము నలంకరించి నామనోరథమును దీర్చినట్టి వారును, ధార్మికవరేణ్యులును, సంస్కృతాంధ్రభాషా విశారదులును, సుప్రసిద్ధ న్యాయవాదులు నగు బ్ర॥ పరిభల లక్ష్మీనరసింహముపంతులు బి. ఎ. బి. ఎల్. గారికిని కృతజ్ఞతాపూర్వక వందనము లర్పించి యీ గ్రంథరచనకుఁ బ్రోత్సాహకులై యీ ప్రథమ ముద్రణమునకుమాత్ర మధికారము బొందినట్టి మ॥ రా॥ శ్రీ చందా నారాయణశ్రేష్ఠిగారి

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

ప్రాంచి బుక్కుషాపు మానేజరులగు మ॥ శ్రీ॥ నీలా రాజయ్య యను వైశ్యసత్తమునకు, నిం దేదేని సహాయ మొనరించిన మిత్రివరులకును ధర్మరక్షకుఁడగు భగవంతుఁ డాయురారోగ్య భాగ్యముల నొసంగి రక్షించుఁగాక యని ప్రార్థించుచు విర మించుచున్న వాఁడను.

26-5-1934 }
శికింద్రాబాద్ }

సుకవివిధేయుఁడు
చివుకుల అప్పయ్యశాస్త్రి.

శ్లో॥ "ఉచ్చైర్గతి ర్జగతి సిద్ధ్యతి ధర్మతశ్చ
త్తస్యప్రమాచ వచసైః కృతకేతరైశ్చ
త్తేషాం ప్రకాశన దశాచమహీసురైశ్చ
త్తానంతరేణ నిపతేత్క్వను మత్ప్రణామః॥



CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

# పండితాభిప్రాయములు.

---

ఆమ్నాయార్థ వాచస్పతీత్యాది బిరుదాంచితులును, వేద వేదాంగ పండితులు నగు బ్ర॥ వడలి లక్ష్మీనారాయణశాస్త్రిల వారు 7-4-34 తేది పిఠాపురమునుండి యిట్లు వ్రాయు చున్నారు.

"యుష్మత్ప్రేషితా వేదవేదాంగచంద్రికా స్థాలీపులాక న్యాయేన దృష్టా హృదయాహ్లాద మజీజనత్. యుష్మదీ యైతాదృ శాతిగంభీరార్థ ప్రకాశన చాతురీధురీణతా మాక లయ్య ఈశాస మాశాస్మహే పునఃపునః ప్రబంధరచనాసు నియోజయేతి.

---

మహామహోపాధ్యాయ, విమర్శకాగ్రేసరాది బిరుదాం కితులును, ధార్మిక మహోపదేశకులు నగు బ్ర॥ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిలవారు.

జగన్నాధపురం, కాకినాడ

12-4-34

పండితవర్యా!

మీరు రచించిన వేదవేదాంగచంద్రికను సమగ్రముగా జదివించి వింటిని. ఈ గ్రంథ రాజము చాల మనోహరమగు శైలియును నిర్దుష్టమగు భాషయును విలువయగు ధర్మబోధయు

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

గలిగి విరాజిల్లుచున్నది. విద్యాశాఖవారిట్టి యుద్గ్రంథములు విద్వాన్ పరీక్షమున్నగువానికిఁ బఠనీయ గ్రంథములనుగా నిర్ణయించిన భాషకును దేశమునకును గూడ జాల యుపయోగ మొనరించినవా రగుదురని నాతలంపు. ఇట్టి యుత్తమ కృతుల నొనరించుట కనుకూలముగా నీశ్వరుఁడు మీకు దీర్ఘాయురారోగ్యైశ్వర్యముల నొసంగుగాత. జిల్లాబోర్డు వారు గ్రంథాలయములకై దీని నంగీకరించుదురుగాక.



CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

# విషయసూచిక.

## వేదము.

విషయము, పుట.



## వేదాంగములు.



CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

## తప్పొప్పుల పట్టి.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 5 | శుతి | శ్రుతి |
| 19 | 7 | లిచ్చు | నిచ్చు |
| 32 | 8 | జ్ఞాయజ్ఞ | జ్ఞానయజ్ఞ |
| 33 | 9 | పుషుఁరు | పురుషుఁ |
| 34 | 17 | పూర్ణత్వమును | పూర్ణమును |
| 35 | 20 | స్వేచ్ఛగా | స్వేచ్ఛగా |
| 45 | 7 | యగుగు | యగు |
| 50 | 20 | సంబధ | సంబంధ |
| 54 | 4 | దింశతి | వింశతి |
| 61 | 19 | "శాఖల" | "శాకల". |
| ‹9 | 4 | పరస్వర | పరస్పర |
| 72 | 18 | ౧౧౧౩౧ | ౧౧౩౧ |
| 84 | 14 | పర్వాచీనులు | అర్వాచీనులు |
| 107 | 14 | చూడ | గూడ |

ఇంకను స. న ప. వ. ర, ఱ, థ, ధ, ల, ళ, అక్షరా ర్థానుస్వారాది వ్యత్యయములను మన్నించి వలసినట్లు సవరించు కొని పఠింపఁ బ్రార్థితులు.

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

శ్రీ పరబ్రహ్మణే నమః.

# వేదవేదాంగచంద్రిక

## వేదము.

,,యో బ్రహ్మాణం విదధాతి పూర్వం
యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై
తగ్ం హ దేవ మాత్మబుద్ధిప్రకాశం
ముముక్షు ర్వై శరణ మహం ప్రపద్యే,,

వేద మనఁగా నేమి?

విదం త్యనేన ధర్మాధర్మా వితి వేదః, విద జ్ఞానే, దీనిచేత ధర్మాధర్మములను దెలిసికొందురు గాన వేదమని చెప్పఁబడును ఈ వేదమునకు శ్రుతి, ఆమ్నాయము అను రెండు పేరులను బ్రధానంబుగా వాడుచుందురు. ,,శ్రూయతే ధర్మాధర్మా నితి శ్రుతిః,, ,,శ్రుశ్రవణే,, ధర్మము, అధర్మము, దీనిచే వినఁబడుచున్నవి గాన శ్రుతి యనియు, ఆమ్నాయతే పారంపర్యేణే త్యామ్నాయః, మ్నాఅభ్యాసే,, ఇది చిరకాలము నుండి పరంపరగా నభ్యసింపఁబడుచున్నది గాన "ఆమ్నాయము" అనియు విజ్ఞులు విశదీకరించియున్నారు.

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

## వేదస్వరూపము. వేదోత్పత్తి.



ఇది యపౌరుషేయంబు, ననాదియు, నిత్యము, స్వతః ప్రమాణ్యవనితము, సల్లక్షణలక్షితము, నత్యంతానుభవగమ్యము, ననధిగతార్థగాని, సందేహవిపర్యయాదిదోషరహితము, పరమేశ్వర దేవర్షిక్రమాదాగతము నై ధర్మార్థకామమోక్షప్రదంబై తనరారుచున్నది. ఈ పూర్వోక్తలక్షణంబులు క్రమంబుగా విస్తరింపఁబడును. వేదము జ్ఞానమునకు భాండారమై యున్నది. మఱియు నితరశాస్త్రంబులన్నియు, నీ వేదమునుండియే జనించినవి. వేదమే స్కంధము. తదితరశాస్త్రములన్నియు దానికి శాఖాప్రశాఖలై యున్నవి. వేదము ప్రధానంబుగా రెండుప్రకారములుగా నున్నది. 1. కంఠాప్తము 2. కల్ప్యము. ఏ శ్రుతి ఋషులచే ప్రత్యక్షముగా గని పెట్టఁబడినదో యది కంఠాప్తము. ఏశ్రుతి, స్మృతిద్వారమునఁగాని, శిష్టాచారద్వారమునఁగానిఋషులచే ననుమానింపఁబడినదో యది కల్ప్యమని చెప్పఁబడుచున్నది. కంఠాప్తశ్రుతి మంత్రభేదము ననుసరించి మూఁడువిధములుగా విభాగింపఁబడినది. 1. ఋక్కు, 2. యజుస్సు, 3. సామము. ఈమూఁడింటికిని "త్రయి" యని మఱియొకపేరు గలదు. ఈకంఠాప్తశ్రుతులే వేదోక్తప్రమాణము ననుసరించి నాలుగుభాగములుగా విభజింపఁబడినవి.

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

1. ఋక్కు, 2. యజుస్సు, 3. సామము 4. అధర్వము అని. లోకమున భాషయందు పద్యము, గద్యము గీతము (పాట) లను మూఁడుభాగములే విధముగాఁగనుపడుచున్నవో యట్లే వేదమునందుఁ బద్యరూపముగా ఋక్కు గద్యరూపముగా యజుస్సు గీతరూపముగా సామమును గనుపట్టుచున్నవి. మిగిలిన యధర్వవేదంబు పద్య గద్య గీతిమంత్రవిమిశ్రితముగా నుండును. వేదమును విభాగించినవారిం గూర్చి రెండువిధములగు నభిప్రాయంబులు గలవు. వ్యాసభగవానులవారే, వేదము మూఁడువిధములుగాను, నాలుగువిధములుగాను విభజించిరని కొందఱును, యజ్ఞక్రియానౌకర్యమునకై యధర్వుఁడను ఋషి వేదవిభాగముఁజేసెననియు నా ఋషియే యజ్ఞకార్యమున కుపయోగించు సూక్తసమూహములను వేదత్రయములోఁ జేర్చి శాంతికపౌష్టికాభిచారికాదితరసూక్తములను వేఱుగాఁజేసెననియు మఱికొందఱు అభిప్రాయపడుచున్నారు. మొదటి పక్షమువారివశిష్టసూక్తసమూహము "అధర్వవేద"మను నామముతోఁ బ్రకాశపఱుపఁబడిన దనియు రెండవపక్షమువారా యధర్వమహర్షియొక్క నామముతోడనే యధర్వవేద మను సంజ్ఞ కలిగినదనియుఁ జెప్పుచున్నారు. ఈ ద్వివిధాభిప్రాయములకును బ్రమాణములు శ్రుతియందుఁ జిక్కుచున్నవి. శతపథబ్రాహ్మణములో నిట్లు చెప్పఁబడియున్నది.

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

"అగ్నేర్వా ఋగ్వేదో జాయతే వాయోర్యజుర్వేదః
సూర్యాత్సామవేదః"

అగ్నివలన ఋగ్వేదము, వాయువువలన యజుర్వేదము, సూర్యునివలన సామవేదము ప్రాప్తమైనవి.

"ఋచో యజూంషి చాన్యాని సామాని వివిధాని చ
ఏవ జ్ఞేయ స్త్రివృ ద్వేదః । యో వేదైనం స వేదవిత్॥
మనుస్మృతి"

ఋగ్వేదము, యజుర్వేదము, నానావిధములగు సామములు, వీనియొక్కమంత్రములకుఁ ద్రివృ ద్వేదమని పేరు. ఎవఁడిద్దానిని దెలిసికొనునో వాఁడు వేదవిదుఁ డని చెప్పఁబడును. ఇఁక నాలుగువిధములుగా వేదము విభాగింపఁబడిన దని చెప్పుటకుఁ గల ప్రమాణములు చెప్పఁబడుచున్నవి.

"తత్రాఽపరా ఋగ్వేదో యజుర్వేద స్సామవేదోఽథర్వవేదః
ఇత్యాది"

ఋక్కాదు లన్నగు నాలుగువేదములు "అపరవిద్య" యని ముండకోపనిషత్తు చెప్పుచున్నది.

ఋగ్వేదో యజుర్వేదస్సామవేదోఽథర్వాంగిరస ఇతిహాసః పురాణం విద్యా ఉపనిషదః" ఇత్యాది.

ఋగ్యజుస్సామాథర్వవేదములు, ఇతిహాసము, పురాణములు మున్నగునవి "అపరవిద్య" యని వాజసనేయబ్రాహ్మణోపనిషత్తునందుఁ గలదు. కాఁబట్టి వేఱువేఱుగు ప్రమాణభేదముల ననుసరించి వేదమును ద్వివిధముగా విభాగించుట

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

యోగ్యమై యున్నది. సమస్తజ్ఞానముల కాధారము లైన యీవేదములనుండియే సర్వశాస్త్రములు జనించినవి.

జ్ఞానము నిత్యవస్తువు. ఈ కారణముచే ప్రలయసమయమునందును జ్ఞానరూపమైన వేదము ప్రణవ (ఓంకార) రూపమున నశ్వరమై నిలిచియుండును. ఈవిషయమున శ్రీవేదవ్యాసభగవానులవారు.

"అనాదినిధనా నిత్యా వాగుత్సృష్టా స్వయంభువా,
ఆదౌ వేదమయీ విద్యా యత స్సర్వాః ప్రవృత్తయః"

స్వయంభువగు భగవంతుని వాక్యరూపమైన వేదమనాదియు, నాశరహితమైనదియు, నిత్యమునై యున్నది. వేదమే సృష్టికిప్రథమావస్థయందు ప్రకాశపరుపబడిన యాదివిద్యయై యున్నది. ఈవేదమువలననే సకలప్రపంచము విస్తరింపఁబడుచున్నది. "ప్రలయకాలేపి సూక్ష్మరూపేణ పరమాత్మని వేదరాశి స్థితః" ప్రలయకాలమునందుఁ గూడఁ బరమాత్మయందు వేదరాశి, సూక్ష్మరూపముతో నిలిచియున్నదని కుల్లూకభట్టాచార్యులవారు వ్రాసియున్నారు. ఇట్లే మేధాతిథి, యను మహామహుఁడును

"నైవ వేదాః ప్రలీయన్తే మహాప్రలయేఽపి"

మహాప్రలయమునందుఁ గూడ వేదములు నశింపనేరవు. వేదములు మనుష్యులచే రచింపఁబడినవి గావు. అందువలన అపౌరుషేయములు. పరమేశ్వరావిర్భూతములు. జ్ఞానము

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

నిత్యమును బ్రహ్మయొక్క స్వరూపమునై యున్నది. అట్టి జ్ఞానముయొక్క వికాసరూపమే వేదము. ఇందువలన వేదములకు భగవంతుని నిశ్వాసరూపము వర్ణింపఁబడినది. వాజసనేయబ్రాహ్మణోపనిషత్తులో

"అస్య మహతో భూతస్య నిశ్వసిత మేతత్ య దృగ్వేదో యజుర్వేద స్సామవేదోఽథర్వాంగిరస ఇతిహాసః పురాణం విద్యా ఉపనిషదః ఇత్యాది"

అని చెప్పఁబడియున్నది. సమస్త వేదములు భగవంతుని నుండి స్వాభావికనిశ్వాసరూపముగాఁ బ్రకటింపఁబడినవి. కృష్ణయజుర్వేదీయ శ్వేతాశ్వతరోపనిషత్తులో

"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం, యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై"

పరమాత్మ తొలుత బ్రహ్మను బుట్టించి యతనికి శ్రుతు లొసంగె ననియు, మఱియొక శ్రుతిలో

"దిశః శ్రోత్రే వాగ్వివృతాశ్చ వేదాః"

ఆ విరాట్పురుషునికి దిక్కులు చెవులు, వేదములు వాక్యములు అని చెప్పఁబడినది. శ్రీగీతాశాస్త్రమందు

"కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవం"

కర్మము వేదమువలన జనించినది. వేద మక్షరబ్రహ్మము నుండి పుట్టినది. మహర్షులు వేదకర్తలు గారు. కాని ద్రష్టలు మాత్రము గాఁగలరు. వేదము నిత్యవస్తువు. అది మహర్షుల

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

యొక్క సమాధిచే నిర్మలములగు నంతఃకరణములందు మాత్రమే ప్రకాశమును బొందును.

"బ్రహ్మాద్యా ఋషిపర్యంతాః స్మారకాః న తు కారకాః"

బ్రహ్మ మొదలుకొని ఋషులవఱకు నుండు వారెవ్వరైనను వేదమును రచించిన కర్తలుగాక వేదమును స్మరించినవారు మాత్రమైయున్నారు. మఱియు,

"యుగాన్తేఽన్తర్హితాన్వేదాన్ సేతిహాసాన్ మహర్షయః
లేభిరే తపసా పూర్వం అనుజ్ఞాతా స్స్వయంభువా"

ప్రలయసమయమందు నితిహాసములతోఁ గూడ నంతర్హితములై యున్న వేదములను సృష్టియొక్క యారంభమునందు బ్రహ్మయనుమతిని బొందిన మహర్షులు తప స్సానరించి పొందిరి.

"సోఽభిధ్యాయ శరీరా త్స్వా త్సిసృక్షు ర్వివిధాః ప్రజాః
అప ఏవ ససర్జాదౌ తాసు బీజ మవాసృజత్
తదండ మభవ ద్ధైమం సహస్రాంశు సమప్రభం
తస్మిన్ జజ్ఞే స్వయం బ్రహ్మా సర్వలోకపితామహః"

(మనుస్మృతి.)

పరమాత్మయొక్క హృదయమునందు సృష్టింపవలెనను కోరిక గలిగినవెంటనే యతఁడు దొలుత కారణజలములలో నిజశక్తిరూపమైన బీజము నుంచెను. ఆ బీజము సూర్యునితో సమానమైన కాంతిగలదియు, బంగారు రంగుగల

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

దియు నై గ్రుడ్డుమాదిరి మారినది. ఆ యండమునందు సర్వ లోకములకుఁ బితామహుఁడగు బ్రహ్మ పుట్టెను. అందువలన బ్రహ్మదేవుఁడే యన్నిటికంటె మొట్టమొదటఁ బుట్టినవాఁడని మనము నిస్సందేహముగాఁ దెలిసికొనఁగలము

“ బ్రహ్మా దేవానాం ప్రథమ స్సంబభూవ
విశ్వస్య కర్తా భువనస్య గోప్తా ”

(ముండకోపనిషత్తు.)

ప్రపంచమును సృష్టించువాఁడును, జగత్తును సంరక్షించు వాఁడు నగు బ్రహ్మ యెల్లవేల్పులకన్నఁ దొలుత జనించె. మఱియు,

“ హిరణ్యగర్భం జనయామాస పూర్వం ”

పరమాత్మసృష్టి యొక్క యాదియందు హిరణ్యగర్భు (బ్రహ్మ) ని సృజించెనని శ్వేతాశ్వతరోపనిషత్తు చెప్పుచున్నది. తరువాత బ్రహ్మదేవుఁడా యండమునందు నివసించి పరమాత్మను ధ్యానించి తద్బలమున రెండువిధములుగా విభజించి యూర్ధ్వాధస్సమస్తలోకములనుసృష్టించి దేవ మనుష్యాదులను నింద్రియాదులు మున్నగువానిని బుట్టించెను. మనువు, బ్రహ్మదేవుఁడు కర్మదేవతల నింద్రాదిదేవతలను సాధ్యులను వెండియు సర్వవిధదేవతలను సృష్టించె నని వ్రాసి యింక నిట్లు వ్రాయుచున్నాఁడు.

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

" అగ్ని వాయు రవిభ్య స్తు త్రయం బ్రహ్మ సనాతనం
దుదోహ యజ్ఞసిద్ధ్యర్థ మృగ్యజు స్సామలక్షణం "

బ్రహ్మ యజ్ఞక్రియను సంపాదించుటకై యగ్ని వాయు, సూర్యులవలన, ఋక్కు, యజుస్సు, సామము అను వేదములను క్రమముగాఁ బితికెను. (ప్రకటించెను) ఈ రీతిగాఁ బరమాత్మ యొక్క నిశ్వాసరూపముతో స్వభావముగాఁ బ్రవహించిన వేదములు బ్రహ్మయొక్క హృదయమునందు నిలిచి దేవతల యొక్కయు, మహర్షులయొక్కయు సమాధిచే నిష్కలుషమైన యంతఃకరణమునందు వికాసభావమును బొంది సకలకళ్యాణంబులను సాధించునవియై తనరారుచున్నవి.

వేదము లపౌరుషేయములా?

వేదోత్పత్తివిషయమునందుఁ బరమేశ్వరుని మొదలుకొని దేవతలు, ఋషులవఱకుఁగల సంబంధమును జూచి చాలమంది హృదయములం దనేకసందేహములఁబొందుచున్నారు. ఎప్పుడు ఋషులచే వేదములు ప్రకాశపరుపఁబడిన వని చెప్పుచున్నారో యప్పుడా వేదములకు రచయితలు వారేని కారు? ఈ రీతిగా కర్త లేర్పడినపుడు వేదము లపౌరుషేయము లెట్లు కాఁగలవు? ఎందుల కనఁగా వేదములయందు రచయితలుగా నున్న ట్లనేక మహర్షుల నామములు కన్పడుచున్నవి. దృష్టాంతమునకై



CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

ఋగ్వేదము గ్రహింపఁబడుచున్నది. ఋగ్వేదమునందలి స్తోత్ర సమూహము పదిమండలములుగా విభజింపఁ బడినది. వానిలో మొదటిమండలమునకును, తుదిమండలమునకును రచయితలనేక మహర్షు లున్నారు. మిగిలిన యెనిమిది మండలములకు నైన మంత్రద్రష్టలగు మహర్షులు రచయితలుగా నున్నట్లు వారినామము లేఁబడియున్నవి. ఎట్లంటేని రెండవమండలమునకుఁ గర్త గృత్సమ మదుఁడును, మూఁడవ మండలముయొక్క రచయిత విశ్వామిత్రుండును, నాల్గవదానికి వామదేవుఁడును, నైదవదానికి నత్రియును, నారవదానికి భరద్వాజుండును, నేడవదానికి వశిష్ఠుండును, నెనిమిదవదానికిఁ గణ్వుండును, దొమ్మిదవ మండలమునకుఁ గర్త యాంగిరసుండునని తెలియనగును. ఇట్లు స్పష్టముగా ఋషుల నామములు లిఖింపఁ బడియున్నప్పుడు వేదము లా మహర్షుల రచనమే యని యేల చెప్పఁ గూడదు? ఇంకొక కారణముఁబట్టి చూచెదము. ఒకవేదమే భగవంతుని నిశ్వాసరూపముగావచ్చినదని యొకచోటను, బ్రహ్మయొక్క ముఖమునుండి బయలు వెడలిన దని మఱియొకచోటను అగ్ని, వాయు, ప్రభృతులవలన బయలుదేరిన దని యింకొకచోటను మహర్షుల హృదయములందుఁ బ్రకటితము లైనవని వేఱొకచోటను వ్రాయఁబడినది. వీనిలో సత్యమేది? యేదిగాదు? ఈ ప్రకారముగా వేలకొలఁది సంశయములు ప్రస్తుతసమయమునఁ గలుగు

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

చున్నవి. ఇందువలన యథార్థముగా వేదావిర్భావముయొక్క తత్వమును బ్రకాశపఱచి సర్వ సంశయములును నివర్తింపఁ జేయఁబడుచున్నవి.

## నవీనుల సందేహములకు సమాధానములు

సూక్ష్మదృష్టితో విచారించిన మీఁదఁ బరమాత్మ మొదలుకొని ఋషులపఱకు వారి యంతఃకరణంబులందు వేదములు జనించిన వనుట కే విధి యావఱకుఁ జూపఁబడెనదో యనియుఁ తయు నొకటియే యని వివేకులగు వారికిఁ దెలియఁ గలదు. జ్ఞానము నిత్యము. జ్ఞానరూపమే వేదము. అందువలన వేదము గూడ నిత్యమైనది. పరమేశ్వరుఁడు జ్ఞానరూపుఁడు. ఈ కారణముఁబట్టి జ్ఞానరూప మైన వేదము ప్రళయకాలములోఁ బరమాత్మహృదయమందు జ్ఞానరూపముతో నుండి జేయు చున్నది. ప్రళయ మెట్టిపనులుగూడ లేనట్టి కాలము. ఆ కారణముచేతఁ బరమేశ్వరుఁడా సమయమందు శ్వాసములు లేని యోగనిద్రయందు శయనించుచున్నాఁడు

"యదా స దేవో జాగర్తి, త దేదం చేష్టతే జగత్
యదా స్వపితి శాంతాత్మా, తదాసర్వం నిమీలతి
ఏవం స జాగ్రత్స్వప్నాభ్యా, మిదం సర్వం చరాచరం
సంజీవయతి చాజస్రం, ప్రమాపయతి చావ్యయః"

పరమేశ్వరుఁ డెప్పుడు మేలుకొనుచున్నాఁడో యపుడే జగముగూడఁ బ్రివర్తించుచుండును. ఎప్పుడు శాంతుఁడై

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

నిద్రించుచున్నాఁడో యప్పు డిదంతయుఁ బ్రళయమును బొందు చున్నది. ఈరీతిగా నవ్యక్తుండును, పరమపురుషుండు నగు భగవంతుఁడు జాగ్రత్స్వప్నదశల మూలమునఁ జరాచరరూప మగు నీ విశ్వమును బుట్టించుచున్నాఁడు. గిట్టించుచున్నాఁడు. ప్రళయమైనపిదప ప్రళయములో లీనమైయున్న జీవులసంస్కారము క్రియోన్ముఖ మెప్పుడగునో యప్పుడు భగవంతుడు స్వయముగా యోగనిద్రనుండి మేల్కొని జగమును సృష్టించుటకు సంకల్పించును. శ్వాసము లేని యోగనిద్రాదశ యనంతరమే శ్వాసముతోఁ గూడిన యా పరాత్పరునియొక్క యీ సృష్టి జేసెడి నవస్థ (అనఁగా సిసృక్షు) యగును. పురాణాదులయం దీ విషయమును గూర్చి యనేకరీతులుగా వర్ణించి యున్నారు. ఈ యవస్థయే వేదములందు వర్ణింపఁబడినది.

"ఏకోఽహం బహు స్యాం ప్రజాయేయ"

నే నేకము నుండి యనేక మగుదునుగాక! ప్రజలను సృష్టించెదనుగాక! భగవంతుని యీ సిసృక్షారూపమైన మొదటి భావమును బ్రహ్మకుఁ గలిగించి పూర్వకల్పము ననుసరించి సృష్టిని విస్తరింపఁ జేయ మొదలిడె. ఈ సృష్టిక్రియాదశలో వచ్చిన నిశ్వాసమే వేదరాశిని బ్రకటించుచున్నది. అందువలన నిష్క్రియుండగు భగవంతునియందలి ప్రథమక్రియాసూచనయే క్రియాశక్తి కధిష్ఠాతగా నున్న బ్రహ్మమును గ్రియతోడనే

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

కూడిన స్వాభావిక జ్ఞానముయొక్క వికాసమే నిశ్శ్వాసరూప ముతో వెడలిన వేదముల వికాసమై యున్నది. ఎందులకనగ? భగవంతునిలో జ్ఞానబలక్రియలు స్వాభావికములై యున్నవి. ఇవియే పరమాత్మవలన వేదము వికసించుటకును, బ్రహ్మ హృదయమునందు వేదము లుండుటకును హేతుభూతములై నవి. కాన నివి యపౌరుషేయములు. ఇందు సందియమేమియు లేదు. ఇట్టి గంభీరవిజ్ఞానము మనుస్మృతిలో బ్రహ్మో త్పత్తితోఁ గూడఁ జెప్పఁబడినది. పరమాత్మ తన తనువు నుండి వివిధప్రజాసృష్టిఁ జేయవలెనని తలఁచి తొలుత జలమును గలిగించినాఁడని మనువు చెప్పిన శ్లోకము క్రిందఁ జెప్పియున్నాము. ఈ జలము సాధారణజలముగాదు. సృష్టి మహత్తత్త్వము మొద లగువానినుండి క్రమముగాఁ గలుగును. మొట్టమొదటనే పంచ భూతాత్మక మైన జల మేర్పడుటకు వీలులేదు. దీని వృత్తాంత ము శ్రుతియందు స్పష్టీకరింపఁ బడి యున్నది.

"తమ ఆసీ త్తమసా గూఢ మగ్రే ప్రకేతం సలిలం సర్వమా ఇదం"

(ఋగ్వేదము)

దీని భాష్యములో సాయణాచార్యులవారిట్లు చెప్పుచు న్నారు.

"సలిలం, సల్ గతౌ, ఔణాదికః ఇలచ్ ఇదం దృశ్యమానం సర్వం జగత్ సలిలం కారణేన సంగత మవిభాగాపన్న మాసీత్"

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

కారణములో లీనమైన సమష్టిరూపమైన సంస్కార మే యీ సలిలము. దీనికే "అప్" లేక "కారణవారి" యని చెప్పఁబడనది. పరమాత్మ సృష్టిఁజేయఁ దలఁచి తొలుత నీ సంస్కారరాశుల నుద్బోధనము జేయుచున్నాఁడు. ఇదియే మనుస్మృతిలోని కారణవారి రూపజలవిజ్ఞానము. ఈ ప్రకార ముగా మనువు వచించినట్లు సంస్కారరాశి యవ్యాకృతదశలో మెలఁకువఁ బొందిన పిమ్మట బరమాత్మ దానియందుఁ దన క్రియాశక్తిరూపమైన బీజము నుంచును.

ఈ క్రియాశక్తియే వృద్ధిని బొంది మిక్కిలి కాంతి గలిగిన మహాసూర్యునివలెఁ బ్రకాశించుచున్నది. దీనినుండి బ్రహ్మ దేవుఁ డావిర్భవించెను. దీనివలనఁ దేలిన సారాంశ మేమనఁగా, భగవంతునకు సృష్టించెడి కోర్కె గలిగిన మీఁదఁ బొత్తుగా వికారములు లేని ప్రకృతియం దతని క్రియాశక్తి గలిసెను. దానినుండి బ్రహ్మ బయలుదేరినాఁడని తెలియుచున్నది. ఈ సృష్టియొక్క ప్రారంభదశ మనోవాచా మగోచరము. ఇదియే జ్యోతిష్మతియగు కారణవారియందుఁ గ్రియాశాలినియును, సమష్టిప్రాణశక్తియు నైన బ్రహ్మకు సూక్ష్మశరీరమై యున్నది ఈ విషయముఁ గూర్చి యథర్వవేదములోని ముండకోపనిషత్తులో నొక చక్కని మంత్రము లభించుచున్నది

"తపసా చీయతే బ్రహ్మ, తతోన్న మభిజాయతే
అన్నాత్ప్రాణో మనస్సత్యం లోకాః కర్మసుచామృతం"

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

దీనికి శ్రీజగద్గురు శంకరభగవత్పాదాచార్యులవారు తమభాష్యమును నం దిట్లు వ్రాయుచున్నారు.

"తపసా జ్ఞానేన ఉత్పత్తి విధిజ్ఞతయా భూతయోన్యక్షరం బ్రహ్మ చీయతే ఉపచీయతే ఉత్పిపాదయిష దిదం జగ దంకుర మివబీజ ముచ్ఛూనతాం గచ్ఛతి పుత్ర మివ పితా హర్షేణ ఏవం సర్వజ్ఞతయా సృష్టిస్థితిసంహారశక్తి విజ్ఞానవత్తయా ఉపచితాత్తతో బ్రహ్మణః అన్నం అద్యతే భుజ్యతేత్యన్న మవ్యాకృతం సాధారణం కారణం సంసారిణాం వ్యాచికీర్షితావస్థారూపేణ అభిజాయతే ఉత్పద్యతే తతశ్చ అవ్యాకృతా చ్చికీర్షితావస్థా దన్నా త్ప్రాణో హిరణ్యగర్భో బ్రహ్మణో జ్ఞానక్రియాశక్త్యధిష్టితో జగత్సాధారణో౽ విద్యా కామ కర్మభూత సముదాయ బీజాంకురో జగదాత్మా అభిజాయతే ఇత్యే షపంగః ఇత్యాది"

దీని భావార్థ మేమన, భూతములకుఁ గారణుండగు బ్రహ్మ తపోద్వారమున వృద్ధి బొందుచున్నాఁడు. పిమ్మట నతని వలన నన్నము (అనఁగా నవ్యాకృతమగు ప్రకృతి) వ్యాకృత ప్రాయ మగు దశకు వచ్చి ప్రకటన మగుచున్నది ఈ భావమునే "అపఏవ ససర్జాదౌ" అను దానితో మనువు వర్ణించి యున్నాఁడు. తరువాతఁ బరమాత్మయొక్క తపశ్శక్తిచేఁ బొందఁబడిన యావికారములేని ప్రకృతివలన సమష్టిప్రాణ రూపి యైన హిరణ్యగర్భ ముద్భవించెను. ఇదియే "హిరణ్యగర్భ స్సమవర్త తాగ్రే" మున్నగు శ్రుతులచే వర్ణింపఁబడిన బ్రహ్మకు సూక్ష్మశరీర మైయున్నది. భాష్యకారులగు శ్రీశంకర భగవత్పాదాచార్యులవారిచే హిరణ్యగర్భుఁడు.

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

" బ్రహ్మణోజ్ఞానక్రియాశక్త్యధిష్ఠితో జగదాత్మా "

యని వర్ణింపఁబడెను. మనస్సు, సత్యము. లోకములు మున్నగునవి దేనిచే సృజింపఁబడుచున్నవో యాక్రియాశక్తి, సృష్టికారిణియు నిం దీవలకే వర్ణింపఁబడియున్న జ్ఞానశక్తి, భగవంతుని నిశ్వాసరూపముగా బయలువెడలిన వేదరాశియునై యున్నది. ఈ రీతిగా సృష్టికిఁ బూర్వమే స్వయముగాఁ బరమాత్మ నుండి బ్రహ్మకో వేదోదయ మగుచున్నది, ఆకారణమున వేదమున కపౌరుషేయత్వము చెప్పుటలో శంకింపనలసిన యవసర మేమియులేదు. ఇఁకఋషుల యంతఃకరణంబునం దేరీతిగా నేయవస్థలో వేదములు బయలువెడలినవో దేనివలన నపౌరుషేయత్వమున కే హానియు రానేరదో యది చూపఁబడఁ బోవుచున్నది. ఏ ప్రకారముగా సమష్టిప్రాణము (అనఁగా బ్రహ్మాండ ప్రకృతిగతమైనదియు, వ్యాపకమైనదియు నగు ప్రాణమే) బ్రహ్మకు సూక్ష్మశరీరమో, యే వ్యాపకప్రాణము వలన వేలువేలు జీవులయొక్క శరీరమునందుఁ బ్రాణశక్తి విభజింపఁ బడుచున్నదో యా రీతిగానే సమష్టిగా నుండు నంతఃకరణము (అనగా బ్రహ్మాండప్రకృతిలో వ్యాపింపఁబడిన యంతఃకరణమే) చతుర్ముఖబ్రహ్మకు స్వరూపమై యున్నది. ఈ వ్యాపక మైన యంతఃకరణమువలననే వ్యష్టిరూపముతో భిన్నభిన్నజీవుల కేంద్రమునందు భిన్నభిన్నములగు నంతఃకర

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

ణములుగాఁ జిక్కుచున్నవి. ఇందలి మనశ్శబ్ద మంతఃకరణమును జెప్పునది. ఆయంతఃకరణము, మనో బుద్ధి చిత్తాహంకారము లను నాల్గుతత్వములతోఁ గూడికొనినది. ఇవియే సమష్టిగా విచారించినచో బ్రహ్మకు నాల్గుమొగము లైనవి. ఇప్పుడు దీని వలనఁ బ్రత్యేక మైన యంతఃకరణమునకుఁ గూడ జతుర్ముఖ బ్రహ్మసంబంధ మున్న దని సిద్ధాంతమైనది, కారణ మేమన ప్రత్యేకవ్యష్ట్యంతఃకరణము సమష్ట్యంతఃకరణరూపి యైన చతు ర్ముఖబ్రహ్మయొక్క యంశమైయున్నది. ఇప్పుడు విచారణీ యాంశ మేమనఁగా ఋషులేదశలో వేదమంత్రములను జూచి రనునది. ఋషులు తపోయోగములమూలమున సమాధి యం దున్న సమయములో వేదమంత్రములఁ జూడఁ గల్గుదురు. అట్టిదశలో నీ సర్వమంత్రములు వారి దివ్యదృష్టికి స్పష్టముగా గోచరించును. ఆ దశ యెట్టిదో విచారింపఁబడుచున్నది. అంతః కరణము సమష్టినుండి తన యింద్రియములందుఁ జిక్కుకొని యుండుట జీవభావలక్షణమగును. ఇందువలన వ్యాపక మైన యంతఃకరణమునుండి వేఱయినందువలన జీవుఁ డల్పజ్ఞుఁ డగు చున్నాఁడు. అయితే జితేంద్రియుఁడగు యోగి తన యంతఃకర ణమును నింద్రియములనుండి వేఱుగాఁ జేసి వ్యాపకమైన సమ ష్ట్యంతఃకరణముతోఁ గూడ గల్పినప్పుడే యతనికి సమాధి



CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

యగును. ఋషు లీసమాధిదశయందే వేదమును జూచుచు న్నారు. అందువలన నీ దశయందు వ్యాపకాంతఃకరణము (అనఁగాఁజతుర్ముఖబ్రహ్మతోఁగూడ సూక్ష్మరాజ్యము) నందు ఋషులకుఁ దాదాత్మ్యము గల్గుచుండును. దీనింబట్టి బ్రహ్మ మూలమున వేదములు పొందుటయు సమాధిలో నున్న ఋషుల యంతఃకరణమందు వేదములు ప్రకట మగుటయు నొకటే. పరమాత్మని యే భావములో వేదములు స్వయ ముగాఁ బ్రకటమైనందువలన నపౌరుషేయము లని చెప్పఁబడు చున్నవో యాభావము ఋషులకు సమాధిదశలోని భావము మూలమున లభ్యమై యున్నది. కారణ మేమన? జీవుఁడును బ్రహ్మము నొకటి యగుటం బట్టియే. కేవల మవిద్యనుబట్టి జీవుఁడు, దేశము, కాలము, వస్తువుల మూలమునస్థూలముగాను సూక్ష్మముగాను పరిచ్ఛిన్నుఁడు. ఇఁకఁ బరమాత్మయో దేశ కాల పాత్రముల మూలమునఁ బరిచ్ఛిన్నుఁడు గాఁడు. విషయ ములం దపేక్షగలిగిన జీవుని యంతఃకరణ మింద్రియపర మగు టచే దానియందుఁ బరిచ్ఛిన్నభావ ముండును. సమాధిదశ యందు వ్యష్టిగానుండు నంతఃకరణమింద్రియములనుండి వేఱయి వ్యాపకాంతఃకరణమునందుఁ గలిసినందున దానికిఁ బరిచ్ఛిన్న భావము నశించి బ్రహ్మభావముతోఁ గూడ సూక్ష్మరాజ్యము నందు నొకరూపమే కలుగుచున్నది. ఈ యేకాకారిత్వము

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

యొక్క ఫలమే వేదము. ఇందువలన నాసమయమునం దేమా
టలు చూడఁబడునో యామాటలన్నియు భగవద్వాక్యములు,
నపౌరుషేయములు, నగుట కే సందియమును లేదు. అందు
వలన వేద మపౌరుషేయమైనది. కాఁబట్టి వేదము పరమాత్మ
యొక్కనిశ్వాసరూప మైన దనినను. బ్రహ్మహృదయ మం
దున్న దనినను, దేవర్షిబ్రహ్మర్షులయంతఃకరణమందుఁ బ్రకాశిత
మైనదన్నను నొకయర్థము లిచ్చు సిద్ధాంతము లేసుమీ

— { వేదమీశ్వరావిర్భూతమగుటకును<br>బూర్ణమగుటకును గారణములేమి ? } —

వేద మపౌరుషేయము. వేద మీశ్వరావిర్భూతము. ఈ విష
యమునందు వైజ్ఞానికాలోచన మవసరము లేదు. అదృష్టవం
తుడగు నే పురుషుని నిర్మలాంతఃకరణమందు వేదజ్ఞానజ్యోతి
ప్రతిఫలించినదో యతఁడే, యీప్రకారముగా భాషతోఁ భావ
ములతో, మఱియుఁ బూర్ణత్వముతోఁ గూడికొనిన గ్రంథము
పరిచ్ఛిన్నమగు ప్రకృతిగల మనుష్యుని మూలమున నిర్మించు
టకు శక్యమగునా? కాదా? యను విషయము స్వయముగాఁ
దెలిసికొనఁగలఁడు. వైదికభాషనుగుఱించి యొకసారి నీదృష్టిని
మఱల్చి కనుఁ గొనుము. మనుష్యుని వైదుష్య మే భాషను
బ్రకాశింపఁజాలునో యద్దానికంటె వైదికసంస్కృతభాష
యొక వైలక్షణ్యము గల్గియున్నది. ఇఁక వేదమంత్రమహిమ

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

యింతింత యని చెప్పఁగలమా! సర్వశక్తిసంపన్నుండును, ననంతుండును, నగు పరమేశ్వరుని ముఖమునుండి బయలువెడలిన యొక్కొక్క మంత్రమునందు ననంతమైనశక్తి నిండియున్నది. ఈ మంత్రములను సరియైనయుచ్చారణముతో సిద్ధి జేసికొనిన వారికి సకలమనోరథములు ఫలింపఁగలవు. ఇట్లే యీమంత్రముల నపస్వరములతోడను. నపప్రయోగములతోడను నుపయోగించినచో హానులుగూడఁ గలుగఁగలవు, ఇవన్నియు వేదాపౌరుషేయత్వము దెలియఁబరచు బలవల్లక్షణములై యున్నవి. ఇవియే కాక పూర్ణుండగు భగవంతుని వాక్యరూపమైన వేద మెల్లవిధములఁ బూర్ణ మని చెప్పుట ప్రధానలక్షణమై యున్నది. మనుష్యుని బుద్ధిపరిపాకమును బట్టి విరచింపఁబడిన యే పుస్తకమైనఁ గాని మనుష్యబుద్ధిపరిమితికి లోఁబడినదియుఁ బూర్ణముగానిదియు నగుటం జేసి యాగ్రంథమునకు సర్వాంగీణపూర్ణత్వ మెన్నటికిని గలుగనేరదు. వేదము మాత్ర మట్లుగాదు. వేదమునందు జీవుఁ డభ్యుదయము, నిశ్శ్రేయసములను సాధించు విషయముయొక్క పూర్ణత్వమును, జీవునకుఁ ద్రివిధశుద్ధిని సంపాదించి ముక్తిని బొందించెడి యర్థము,కర్మము నుపాసనము మఱియు జ్ఞానముయొక్క పూర్ణత్వమును, సాధకునకు సత్వరజస్తమోగుణమయమైన ప్రకృతియొక్క ప్రత్యేకపుఁ స్తరమును నిరీక్షణము జేయించి ముక్తినొసంగెడి గుణ

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

ముల పూర్ణత్వమును, గలదు. ప్రపంచము భావమయ మైనది. భావమయుఁ డైన భగవంతుని సత్త గూడ ప్రపంచ మునందు నిండి నిబిడీకృతమై యున్నది. కాఁబట్టి భావములను జక్కఁగాఁ దెలిసికొనెడి జ్ఞానముచేత భావములను గ్రహించు భగవంతునిగూడఁ జెందవచ్చును. దీనింబట్టి వేదమునందు మూఁడురీతులుగా నుండు భావములయొక్క పూర్ణత్వమును గలదు. ఈప్రకారముగా నెన్నివిధముల విచారించినను వేదము యొక్క సర్వాంగీణపూర్ణత మనకుఁ దెలియుచు నపౌరుషేయ త్వము లెస్సగా సిద్ధించుచున్నది. ఇందు సందియ మేమాత్ర మును లేదు. ఇఁకమీఁదఁ బైనఁ జెప్పఁబడిన విషయములు ప్రత్యేకప్రత్యేకముగా విచారింపఁబడఁబోవుచున్నవి. మనుష్యుల బుద్ధి తమతమ యోగ్యతల ననుసరించి యిహలోకమునకు సంబంధించిన యభివృద్ధిని బరలోకమునకు సంబంధించిన స్వర్గా దులయందలిసుఖభోగరూపోన్నతిని మఱియు నిత్యానందమయ మైన మోక్షపదమును గోరుచున్నది. ఈ మూఁడువిధము లగు నున్నతుల యందే మానవీయ మగు నున్నతియొక్క పూర్ణత గలదు. అపౌరుషేయ మగు వేదము సాటిలేనట్టి మంచియుక్తులమూలమున మూఁడురీతులగు నున్నతులవిధిని జూపియున్నది. నేఁటికాలమున నవీనపదార్థవిద్య (సైన్సు) యభివృద్ధినిఁ జూచి మనుష్యులు ముగ్ధు లగుచున్నారు. వారు

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

తమప్రాచీనవేదవిద్యయొక్క గంభీరభావమును మరచి "కృషి కులగానము" అని చెప్పుటకుఁగూడ వెనుదీయకున్నారు. కాని దీర్ఘముగా విచారించిచూచినమీఁద వేదముయొక్క మహిమ, గంభీరమ, వారికి బాగుగాఁ దెలియఁగలదు. ఋగ్వేదముయొక్క నాల్గవమండలమునందును, బదియవమండలము నందును గృషియున్నతివిషయమై స్తోత్రాదికము గనుపడును. ఇవన్నియు వ్యవసాయమునందలి పనులు, దానికిఁ బనికివచ్చు యంత్రములు, గోవులు, మహిషములు, మున్నగుగృహపశువుల యభివృద్ధికై భగవంతునింగూర్చి చేయఁబడిన ప్రార్థనలై యున్నవి. నవీనపదార్థవిద్య (సైన్సు) యున్నతి కనులకుఁ జిత్రము గొల్పఁగలదు. బుద్ధికిఁ బ్రమాదములను గల్గింపఁగలదు. అయితే దూరదర్శులును, బరిణామదర్శులును నుదారస్వభావులును, గరుణాళువులు నగు మహర్షులు సైన్సు (నవీనపదార్థవిద్య) యున్నతిచేతఁ బ్రపంచమున నొకవైపునందలిమనుష్యులు సుఖులును ధనులును నగుచున్నారనియు మఱియొక భాగమందలి మనుష్యులు మిక్కిలిదరిద్రులును దుఃఖభాగులును నగుదురనియుఁ దెలిసికొనియుండిరి. ప్రస్తుతకాలమున నే దేశములందు "సైన్సు" అభివృద్ధిఁ బొందియున్నదో యాదేశములందలి యవస్థ చూడఁదగును. వెండియు వానిగాలి భరతఖండమందు వీచుటచేత భారతదేశపు ప్రాచీనస్థితి నవీనస్థితి రెంటిని

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

గలిపి విచారించిన పిమ్మటఁగూడఁ దొలుత భారతదేశము యొక్క యార్థికస్థితి యెట్లుండినదో యిపుడెట్లున్నదో తెలియఁ గలదు. ఈ విషయమంతయు మహర్షినరేణ్యుల నిశితబుద్ధికి గోచరముకాకుండ నుండలేదు. ఇందువలననే సనుత్వముగోరు మహర్షులు స్థూలములైన సంపత్తు సుఖములకుఁ గృషి, గోరక్షణము, మొదలగు వానివిషయము మిక్కిలియెక్కువగాఁ జెప్పుచుండిరి. దీనివలన సమస్తదేశములును సమానరూపముగా సుఖముతోడను, శాంతితోడను, విరాజిల్లినవి. ఇది భగవంతుని కోరికయై యుండినందువలన వేదమునందు వ్యవసాయాభివృద్ధికై భగవంతునింగూర్చి చేయఁబడిన స్తోత్రములు గలవు. రెండవది వేదమునందు "సైన్సు" విషయముగూడఁ దక్కువగా లేదు. ఋగ్వేదమునందు సముద్రయానము, బృహన్నాళికము మున్నగు యుద్ధాస్త్రములు పెక్కురకముల యాగ్నేయాస్త్రములు, రణవిద్యమొదలగువానికిఁగూడఁ బ్రమాణములు చిక్కుచున్నవి. నేఁడు ప్రాచీనమైన మిశ్ర (Egypt) లేక బాబలను (Babylon) యొక్క తాతికంబమును జూచి జన మాశ్చర్యపడుచున్నది. కాని యార్యులైన హిందువులు శిల్పకార్యములం దెట్టి నేర్పరులైరో యది ఋగ్వేదముయొక్క రెండవ, మైదవమండలములం దున్న ప్రమాణములవలనఁ దెలియుచున్నది. అందు వెయ్యిస్తంభములతోఁ గూడిన విశాలమైన

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

యట్టాలికవర్ణన మున్నది. ఇదియుఁగాక యనేకరీతుల నుండు నేఁతపనులయు, శిల్పకళలయు, ధాతుద్రవ్యములయు నిర్మాణము మున్నగువాని మూలమున భారతదేశము వాస్తవముగా బంగారు గనెడి భారతమే యై యుండెను. ఇందులకుఁ బ్రమాణములు ఋగ్వేదములో ప్రథమ చతుర్థమండలములం దుఁ బెక్కు తెన్నులఁ జిక్కుచున్నవి. ఐహికములగు సుఖము ఐశ్వర్యములకై వేదమునందు సకలవిధముల నుండు సాధనములు నిస్సంశయముగా దొరుకుచున్నవి.

" ప్రత్యక్షేణాఽను మిత్యావా, యస్తూపాయో న బుధ్యతే
ఏనం విదంతి వేదేన తస్మాద్వేదస్య వేదతా॥

లౌకికమగు ప్రత్యక్షప్రమాణముచేఁ గాని యనుమాన ప్రమాణముచేఁ గాని యేది బోధింపఁబడఁజాలదో యట్టి యలౌకికవిషయముపై సాధకుని నేర్పరచి దివ్యమైన సుఖమును నెడతెగనియానందము నొసంగుటయే వేదమునకు వేదత్వమై యున్న దని స్మృతి వక్కాణించుచున్నది. వేదమునందు జ్యోతిష్టోమము, దర్శపూర్ణమాసాది బహువిధయజ్ఞములవిధులు విశదీకరింపఁబడినవి. ఇవి యాచరించినందువలనఁ గోరికలు గల సాధకులు స్వర్గమునకు సంబంధించిన యనేకసుఖము లనుభవింపఁజాలుదురు.

త్రైవిద్యా మాం సోమపాః పూతపాపాః
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

తే పుణ్య మాసాద్య సురేంద్రలోక
మశ్నంతి దివ్యా న్దివి దేవభోగాన్॥

వైదికకర్మము నాచరించువాఁడు యజ్ఞద్వారమున భగవంతునకుఁ బూజ గావించి యజ్ఞమునందు మిగిలిన సోమ రసమును ద్రాగి పాపరహితుఁడై స్వర్గలోకమును గోరుచు న్నాఁడు. ఇట్టి జనుఁడు పుణ్యవిపాకరూప మైన యింద్రలోక మునుబొంది యందలిదేవత లనుభవించు మంచిసుఖము ల ననుభవించుచున్నాఁడు. అథర్వవేదీయముండకోపనిషత్తులో "ఏహ్యేహీతి తమాహుతయస్సువర్చస స్సూర్యస్య రశ్మిభిర్యజమానం వహన్తి ప్రియాంవాచమభివదన్త్యోర్చయన్త్య ఏష వః పుణ్యస్సుకృతో బ్రహ్మలోకః॥

ప్రకాశమానము లైన యాహుతులు యజమానుని "రమ్ము రమ్ము" అని పిలుచుచు సూర్యకిరణములమూలమున బుణ్యమయ మైన బ్రహ్మలోకమునకుఁ దీసికొనిపోవుచున్నవి మంచిమాటలు, పూజలు మొదలగువానితో సతనికి సేవజేయు చున్నవి. "అపామసోమంఅమృతాఅభూమ" మేము సోమపానముఁ జేసి యమరుల మైతిమి. ఈ మొదలగు పెక్కు తెలుంగుల నున్న దేవలోకములయందలి సాటిలేని సుఖభోగములు వేదకృపచేతనే సాధింపఁదగినవియై యున్నవి.

మూఁడవది ప్రకృతిపారావార పారంగతమును, మనో వాచామగోచరము నగు బ్రహ్మవర్ణనము వేదమునం దిట్లున్నది.



CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

"న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం
నేమా విద్యుతో భాంతి కుతోఽయమగ్నిః
త మేవ భాన్త మనుభాన్తి సర్వం
తస్య భాసా సర్వ మిదం విభాతి"

ఎందు సూర్యుడుగాని, చంద్రుడుగాని, నక్షత్రములు గాని, విద్యుత్తు గాని, యగ్నిగాని ప్రవేశింపజాలదో, యేది సర్వాతీతమైయున్నదో, దేనియొక్క తేజస్సుచేతను, జ్యోతిచేతను సర్వప్రపంచములు ప్రకాశించుచున్నవో యట్టియానందమయుఁడైన పరమపురుషుని సాక్షాత్కారముఁ జేసికొనుటవలన సాధకునకుఁ గలిగెడియవస్థ యీరీతిగా వర్ణింపఁబడుచున్నది.

"భిద్యతే హృదయగ్రంధి శ్ఛిద్యంతే సర్వసంశయాః
క్షీయంతే చాస్యకర్మాణి తస్మిన్దృష్టే పరావరే"

పరమాత్మదర్శన మైనపుడు హృదయమం దున్న యవిద్యాగ్రంధి విడిపోవును. సమస్తసంశయములునశించును. సంచితములును క్రియమాణములు నగు నెల్లకర్మములు క్షయమైపోవును. మఱియు

"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ
ఆనందం బ్రహ్మణో విద్వా న్న బిభేతి కుతశ్చన"

వాక్కులు దేనిని బ్రకటించుటకై బయలుదేరి యసమర్థములై వెనుకకు మరలినవో, దేనిపై మనోగతిగూడఁ బ్రసరింపఁజాలదో యట్టి యానందమయ మైన పరమపదము నెఱుంగుట

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

వలన సంసారభయము నష్ట మయి పోవుచున్నది. ఇట్టి విషయ మందు "సైన్సు" ఒకలెక్కయా? ప్లేటో (Plato) మఱియు "కాంటు"(Kaut)మహాశయులపరిశోధనములును బరాభూతము లైనవి. సాక్రిటిస్ (Socratis)యను పండితుఁడుఁగూడ భ్రాంతి ముక్కలమాత్ర మేరుకొనుచున్నాఁడు. ఇట్టి బ్రహ్మపదమును బొందించి నిశ్శ్రేయసలాభము గలిగించెడి శక్తి దేనియందైన నున్నచో నది యెల్లగీతులను బూర్ణుండగు భగవంతుని నిశ్వాస రూప మైన వేదమునందే యున్నది. ఇదియే వేదము లపౌరు షేయము లనుటకుఁ బ్రబలప్రమాణము. ఇందుసందియమేమి యు లేదు.

పరమాత్మ పూర్ణుఁడు. జీవుఁడపూర్ణుఁడు. అయితే జీవుని యందుఁ బూర్ణత్వముయొక్క బీజ మున్నది. అట్టి బీజమును వృద్ధిపరచి పూర్ణముగాఁ బ్రకటించి పూర్ణుఁడగుటయే సర్వసాధ నములయొక్కయు సకలశాస్త్రములయొక్కయు లక్ష్యము. ఏ శాస్త్ర మపూర్ణుండైన జీవునిఁ బూర్ణునిగాఁజేసి బ్రహ్మరూపుని గావించుచున్నదో యా శాస్త్రమే సంపూర్ణమైనది. మనుష్యు లచే రచింపఁబడిన శాస్త్రము లన్నిఁటి విచారించినచో నవి ప్రకృతిలో నొకయంశమును వర్ణించునవియని వివేకులగు పురు షులు దెలిసికొనఁగలరు. కొంద ఱొకయంశమునుగూర్చియుఁ గొందఱు మఱియొక యంశమునుగూర్చియుఁ, గొంద ఱొక

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

యంశములో నొక విషయమును ప్రధానముగాను, రెండవ విష యమును గౌణముగాఁ జేకొని వర్ణించుచున్నారు. కాని యపౌ రుషేయ మగు వేదములో నేవిషయమునందు నపూర్ణత యేమాత్రమును లేదు. ఈప్రకారముగానపూర్ణత్వమేయిందున్న యెడల వేదము భగవద్వాక్యమే. గాకపోయెడిది పూర్ణమైన ప్రకృతియే పూర్ణుఁడైన బ్రహ్మనుబ్రకటింపఁగలదనునీమాటయే విజ్ఞానసిద్ధము. భారతదేశము పూర్ణప్రకృతితోఁ గూడికొని నది. అందువలన మోక్షభూమియని చెప్పఁబడుచున్నది. ఎప్పుడు జీవునకు సంబంధించిన ప్రకృతి పూర్ణత్వమును బొందునో యప్పుడే యట్టి యపూర్ణుఁడైన జీవునకుఁ బూర్ణత్వమును బ్రహ్మభావమును బొందుట మూలమున ముక్తి గలుగును. ప్రకృతి, స్థూలము, సూక్ష్మము, కారణము, లేక అధిభూత, అధి దైవ అధ్యాత్మము లను మూఁడుభాగములతోఁ గలిసియున్నది. మనుష్యునియం దీమూఁడుపర్వము లపూర్ణముగాఁ గలవు. అందువలన అధిభౌతికపూర్ణత, అధిదైవికపూర్ణత, ఆధ్యాత్మిక పూర్ణత మనుష్యులకు సంభవించిన తరువాత జీవుఁ (మనుష్య జీవు) డు బ్రహ్మరూపుఁడు గాఁగలఁడు. ఇందులకై యాధిభౌతి కాధిదైవి, కాధ్యాత్మిక త్రివిధశుద్ధిఁ జేయుటకై యుపాయము లేశాస్త్రమునందుఁ బూర్ణముగాఁ జూపఁబడినవో యట్టిశాస్త్రము పూర్ణము, భగవద్వాక్యమును గాఁగలదు. జీవునకు శరీర

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

మాధిభౌతికము, మన మాధిదైవికము బుద్ధి యాధ్యాత్మికము లై యున్నది. శరీరశుద్ధి కర్మమూలమునను, మనశ్శుద్ధి యుపాసనాద్వారమునను, బుద్ధిశుద్ధి జ్ఞానమూలమునఁగాఁగలదు. అందువలన నేశాస్త్రమునందు సమానముగాఁ గర్మము, నుపాసనము జ్ఞానము లనెడి మూఁటియొక్క యుపదేశము సంపూర్ణముగా నుండునో యదియే భగవద్వాక్య మగును. భగవద్గీతలోని పదునెనిమిది యధ్యాయములందును గర్మము, ఉపాసనము, జ్ఞానములను మూఁడింటి యుపదేశము సమానరూపముగా నున్నది. మొదటి యాఱధ్యాయములలో విశేషించి కర్మవిషయమును దరువాతి యాఱధ్యాయములలో విశేషించి యుపాసనావిషయమును, మిగత యాఱధ్యాయములలో విశేషరూపముగా జ్ఞానవిషయమును వర్ణింపఁబడియున్నది. ఎందున నేమాత్రమును బక్షపాతముచూపఁబడలేదు. ఎందుల కనఁగా భగవద్గీత సాక్షాద్భగవంతుని ముఖకమలమునుండి వచ్చిన వాక్యామృతమై యున్నది. ఈ గుణమే వేదమునందుఁగూడఁ గనుపడుచున్నది. వేదము, సంహిత, బ్రాహ్మణము, మఱియు ఆరణ్యకము లేక దానికి విస్తారరూపములైన యుపనిషత్తు లని మూఁడుభాగములుగా విభాగింపఁబడినది. ఇందు గీతారీతిగ మూఁడుభాగములందునుగర్మము, నుపాసనము, జ్ఞానములు వర్ణింపఁబడియున్నను సంహితాభాగమందుఁ బ్రధానముగాఁ నుపాసనాకాండము

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

యొక్కయు, బ్రాహ్మణభాగమందుఁ బ్రధానముగాఁగర్మకాండ ము యొక్కయు, నుపనిషద్భాగమునందుఁ బ్రధానముగా జ్ఞాన కాండముయొక్కయు వర్ణనమున్నది. పరమాత్మ సచ్చిదానంద రూపుఁడు.

అతని సత్సత్తతోఁ గూడఁగర్మమునకు, ఆనందసత్తతోఁ గూడ నుపాసనమునకు, చిత్సత్తతోఁగూడ జ్ఞానమునకుసంబంధ మున్నది. ఈ విషయము లన్నియుఁ బ్రథమసముల్లాసమందుఁ జెప్పఁబడినవి. వేదము, తన సంహిత బ్రాహ్మణము ఉపనిషత్తు లనెడి రూపములతో నున్న మూఁడుభాగముల మూలమునఁ గర్మము,నుపాసనము జ్ఞానములకుఁబూర్ణసాధనములనుజూపించి జీవునకు సచ్చిదానందముల లభింపఁజేసి యతనిని బూర్ణబ్రహ్మ భావమునందుఁ బ్రతిష్ఠించుచున్నది. ఇదియే వేదాపౌరుషేయ త్వము. ఇందు సందియము లేదు. అంగిరోమహర్షులవారు దైవీ మీమాంస యం దీక్రిందివిధముగా వచించియున్నారు.

"గుణభావమయత్వా ద్భగవద్వాక్యం వేదః"

వేదమునందు గుణములయు భావములయు పూర్ణత్వము గలదు. దీనివలన వేదము భగవంతుని వాక్య మైనది. గుణమ యమైనప్రకృతికిఁ ద్రిగుణభేదము ననుసరించి ముఖ్యముగా మూఁడు స్తరములు గలవు. దీనింబట్టి ప్రపంచమునందు సాత్విక, రాజసిక, తామసిక లను నీ మూఁడురీతులుగా నుండు జీవులు

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

దొరుకుదురు. సంసార మనెడి రోగమునకు వైద్యుఁడుగా నుండు వేదముచే మూఁడురీతులుగా నున్న యధికారులకొఱ కాత్మోన్నతికరము లగు నుపాయములు చూపఁబడినందున దానికి వేదత్వము, నపౌరుషేయత్వమును గలిగినవి. లౌకికశాస్త్రముల లక్షణ మేమన? వానిలో నొకానొక గుణమునకుఁ బ్రాధాన్య మిచ్చి యుపదేశింపఁబడినది. ఒక గ్రంథము సాత్త్వికగుణమునకే యాధిక్య మిచ్చి యుపదేశించును. మఱియొకటి రజోగుణవిశేషతను లక్ష్యముగా నుంచుకొని యుపదేశించును. ఇంకొకటి తామసగుణమునే ప్రధానముగాఁజేసి చెప్పుచుండును. ప్రకృతియం దొకగుణమే యున్నయెడల యందఱకు నొకవిధముగానే యుపదేశించి యొకవిధినే చూపుటకు వీలుండెడిది. ప్రకృతియందు మూఁడుగుణములు నుండుటంబట్టి దేనియందు సర్వగుణములుగలజీవుల మేలుకొఱకు యుక్తులు చూపఁబడినవో యది పూర్ణగ్రంథమగును. ఎవనిదగ్గర నెల్లతెఱంగులుగా నుండు రోగములను బోఁగొట్టెడి చికిత్సలు గలవో వాఁడే పూర్ణవైద్యుఁడు. వేదము పూర్ణమును భగవంతునివాక్యము నై యున్నది. ఇందువలననే వేదమునందు మూఁడుప్రకారములుగా నుండు నధికారులకు నుపదేశ మీఁబడియున్నది. వేదమునందు సాత్త్వికుఁడగు నధికారి యాత్మోన్నతికై జ్ఞానయజ్ఞమును, రాజసికుఁడగు నధికారి యాత్మోన్నతికై రాజసికములగు

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

సోమాది యజ్ఞములను దామసికుఁడగు నధికారి శ్యేన యజ్ఞము లోనగు తామసికయజ్ఞములను జేయవలసినదిగా విధింపఁబడినది. ఇది వేదమునకు దూషణము గాదు. పైపెచ్చు దానిభూషణమే యై యున్నది. పూర్ణతయొక్క యాదర్శమును సర్వోత్తమమైన దాని యుదారభావమును నై యున్నది. ఇట్టి దానిని బరిచ్ఛిన్నబుద్ధిగల నేఁటికాలపువారు దెలిసికొనలేక వివిధవిధముల నాక్షేపించుచున్నారు. ప్రపంచమం దందఱు సాత్వికు లైనచో వేద మందఱికొఱకు జ్ఞానయజ్ఞమునే యుపదేశించెడిది. జగమునందు రాజసికులు దామసికులు నగు జనులు హెచ్చుగా నున్నారు. అట్టివారినిఁగూడఁ గనికరించి వారికొఱకు కాలోన్నతిని గలిగించెడి భిన్నభిన్నోపాయములను జూపించి యున్నందుననే యావేదమునకుఁ బూర్ణతయు సర్వజగములకుఁ గల్యాణమును గలిగించు సమర్థతయు, నపౌరుషేయతయు సిద్ధించును. అట్లుగాక రాజసికులు, దామసికులు నగు నధికారులకుఁ గూడ సాత్విక మైన జ్ఞానయజ్ఞ ముపదేశముజేయుటవలన వారికి బుద్ధిభేదము గల్గించు ననధికారచర్చయుఁ గాఁగలదు. దీనివలన వారికి మేలులేకపోవుటయేకాక యనిష్టముగూడ సంభవించును. భగవంతుఁడు గీతలలో నీ రీతి లిఖించియున్నాఁడు.

> " న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినాం
> యోజయే త్సర్వకర్మాణి విద్వాన్ యుక్త స్సమాచరన్

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

ప్రకృతే ర్గుణసమ్మూఢాః సజ్జన్తే గుణకర్మసు
తా నకృత్స్నవిదో మందా న్కృత్స్నవి న్నవిచాలయేత్.

అజ్ఞులును గర్మమార్గము నందాసక్తులును గోరికలుగల వారు నగు పురుషులకు బుద్ధిభేదము గలిగింపఁగూడదు. విద్వాంసుఁడు యోగ్యుఁడునగు పురుషుఁడు స్వయముగా ననుష్ఠించుచు వారి నామార్గమునందు నడిచెడివారలనుగా నొనరింపవలెను. మందమతియు, నల్పజ్ఞుఁడు నగు జనుఁడు ప్రకృతిగుణముల యందుఁ జిక్కి గుణములచేతను గర్మములచేతను లిప్తుఁడగుచున్నాఁడు. విచారశీలుఁడును విశేషదర్శియు నగు పుషుఁరుఁడవ్వారిని దటాలున నాగుణములనుండి దప్పింపఁగూడదు. కాని మిక్కిలి నేర్పుగలిగిన యధికారమునకుఁదగినట్టి యుపాయమును జూపి తిన్నతిన్నగా వారిని నున్నతిగలవారినిగాఁ జేయవలెను. ఇదియే గీతయందలి భగవదాజ్ఞ. ఈ విజ్ఞానమే వేదమునందు సంపూర్ణముగాఁ బ్రకటింపఁబడినది. వేదమునందుఁ బశుహింస మున్నగుకొన్ని విషయములను విధించెడి మంత్రములను జూచి జను లనేకులు గజిబిజిపడుచున్నారు. ఇంకను జాలమంది నిజవైదుష్య మదోన్మత్తులై యో లేక సంప్రదాయము ననుసరించినయనుదారభావములవారైయో తమసిద్ధాంతముల ననుసరించు నట్లామంత్రముల కర్థములను జేయ మొదలిడుదురు.

5

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

కాని యిదంతయు వేదమునందలి మర్మము గుఱ్తెఱుంగని ఫలమై యున్నది. వేదమునం దెచ్చటనైనఁబశుహింసకు సంబంధించినమాత్రము చిక్కినచో దీనినుండి భగవంతుఁడు జీవహింస చేయుట కుపదేశ మొసఁగుచున్నాఁ డను సిద్ధాంత మెన్నటికిని దీయఁగూడదు. ఇట్టివిచారము భ్రమతోఁగూడినది. దీనితాత్ప ర్యము నింకను దీనికిసంబంధించిన విషయము నీక్రింద వ్రాయఁ బడుచున్నది.

సత్వరజస్తమో గుణములతోఁ గూడిన యీ ప్రపంచమందు సర్వప్రకారముల నుండు మనుష్యులు గల రని యీనడుమనే చెప్పఁబడియున్నది. మఱియు గుణముల తారతమ్య ము ననుసరించి రుచిలోను స్వభావములోను బెక్కుభేదములు గలుగుచున్నవి. సాత్వికుఁడగు మనుష్యుఁడు స్వభావముగానే యహింసాపరుఁ డగుచున్నాఁడు. రజోగుణముగలజనుఁ డీరీతిగా నుండఁడు. ఇఁకఁ దమోగుణముగలపురుషుఁడో పైరీతికిఁ బూర్తి గా విపరీతముగానే యుండును. ఈకారణముచేత నందఱకు సాత్వికవిధియొకటియే సరిపడనేరదు. అందఱికిని వేఱువేఱగు విధముల నేర్పరుపఁజాలనియెడల వేదము పూర్ణత్వమును,భగవ ద్వాక్యమును గానేరదు. అందువలన నీవిషయమును విచారిం చుట యోగ్యమై యుండును. రాజసికములును, తామసికములు నగు యజ్ఞములం దెందు హింసయొక్కవిధి యున్నదో యచటి

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

విధి హింసను వృద్ధిజేయు తలంపుతో లేదు. ఇఁక నేమన? తగ్గించుటకొఱకై యున్నది. ఏలయన? జనులు చాలవఱకు రాజసికులుగాని తామసికులుగాని యై యుందురు. వారి ప్రకృతి పుట్టుకనుండియే హింసయం దాసక్తిగలదై యుండును. అవ్వారు సాధారణముగా మాంసమును భుజించుట కిచ్ఛగించుటఁగలదు. వారినిఁ దటాలున నాబుద్ధినుండి తప్పించి సాత్వికులను గాఁజేయుటకై యుపదేశించుట, మూర్ఖత్వమును, ననధికార చర్చయుఁగాఁగలదు. అందువలన వారు దేనిచే నట్టి బుద్ధిని విడుచుచుఁ దుదకు సంపూర్ణముగా వదలిపెట్టఁగలరో యా యపాయ రహితోపాయము వారికిఁ గావలసియున్నది. ఇదియే వేదమునందు వర్ణాశ్రమధర్మ నియమయుతముగాఁ జూపఁబడినది. మఱియు వేదచోదితమును లోకహితకరమునగు యజ్ఞమును శేయఁదలఁచినవారు ముందుగాఁ గొన్ని యోగ్యతలు గలవారుగా నుండవలెను. వారద్దానిని ధర్మబద్ధులై కావించి వివిధవిధపూజలఁ గావించి బ్రాహ్మణులను సంతృప్తులం జేసి దేవతాప్రసాదరూపముగా యజ్ఞశేషమును భుజింపవలసినదని యం దాదేశింపఁ బడినది.

ఈ యజ్ఞమందు విధివిహితముగాఁ జేయుహింస, హింస గానేరదనియు, నిద్దానిని భక్తిశ్రద్ధలతో సక్రమముగా నాచరించి యజ్ఞశేషమును భుజించినవారు సమస్తపాపములనుండి విముక్తులగుదురనియు శాస్త్రములు చెప్పుచున్నవి.

"యా వేద విహితా హింసా, నసాహింసేతి కథ్యతే"

"యజ్ఞశిష్టాశినస్సన్తో ముచ్యంతే సర్వకిల్బిషైః"

[భగవద్గీత

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

ఈ మున్నగు ప్రమాణములు గలవు. ఇట్టి యజ్ఞ మొన
ర్ింప సంకల్పించినవారికి ముందుగా వందలకొలఁది ననుష్ఠాన
ములను, నితర సత్కార్యములను జేయవలసినవిధి గలదు.
దీనివలన వారి కధికధనవ్యయమును, విశేషశ్రమయు నగును.
దీనివలన ధనాదులయందు విరాగబుద్ధియు, దమము, శమ
మును గలుగఁ గలదు. మఱియుఁ గ్రమముగాఁ జిత్తమునందు
సాత్త్విక భావమును గలుగును. ఇందువలన హింసాకార్యము
లందుఁ బ్రీతి తగ్గును. ఈ విధివిహితమగు యజ్ఞశేషమును
దేవతాప్రసాదరూపముగా గ్రహించుటకు బుద్ధిపుట్టుటవలన
దానితత్త్వ మెఱుంగుటకుఁ బ్రయత్నింతురు. తరువాత స్వధర్మ
మును నిర్వర్తించి కృతార్థులైన వీరే రాజసికములును, తామ
సికములు నగు క్రతువులందు విరాగమును జెంది సాత్త్వికమగు
జ్ఞానయజ్ఞమున కధికారులగుట చిట్టచివరఫలమై యున్నది.
ఇదియే వేదోదారత, ఇదియే వేదపూర్ణత, దీనిపై విచారించిన
బుద్ధిమంతులు, దేనివలన నెల్లప్రకారముల నుండు నధికారులకు
మేలును; నాత్మోన్నతి గలుగుచున్నదో యట్టి భగవద్వాక్య
రూప మైన వేదమునందే యిట్టి నిష్పక్షపాతమగు నుదారభావ
మున్నదని తప్పక తెలిసికొనుచున్నారు. అదియుఁగాక వేదము
నందుఁ జెప్పఁబడిన కర్మవిజ్ఞానము ననుసరించి "స్వర్గకామోయ
జేత" యను నీప్రమాణమువలన వైదికమును, రాజసికమునగు
యజ్ఞముయొక్క ప్రభావముచేత నాతనికిఁ బరలోకమునందు

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

స్వర్గము మున్నగు లోకములప్రాప్తి కాఁగలదు. ఇదియే వేద గుణమును విచారించుటవలనఁ గలిగిన పూర్ణమాహాత్మ్యము. వేదముయొక్క యపౌరుషేయత్వ మింకను భావపూర్ణత్వము నందుఁగలదు. ఈవిషయము మొదటిసముల్లాసమునందుఁ బర మాత్మకుఁ గల త్రివిధభావములు ప్రకృతివిలాసము లేక ప్రకృతి లయము ననుసరించి సాధకునకు లభించుచున్న వని తీర్మానింపఁ బడియున్నది. అతని యధ్యాత్మభావము మాయకంటె నతీతం బును, మనోవాచామగోచరమును నిర్గుణంబును, నిష్క్రియ యునగు పరబ్రహ్మంబు, అతని యధిదైవభావము మాయగల చైతన్యుండును, సృష్టి, స్థితి, లయములకుఁ గర్తయగు నీశ్వ రుఁడు. ఇఁక నతని యధిభూతభావ మనంతకోటి బ్రహ్మాండ మయుండగు విరాట్పురుషుండు, ఇందులకై సర్వకారణుఁడైన పరమాత్మయందు మూఁడుభావము లున్నప్పుడు కార్యబ్రహ్మ రూపియగు నీప్రపంచమునఁ గూడ మూఁడుభావములు గావల యును. ఎందులకన, ఎప్పుడు కార్యము కారణముయొక్క విస్తా రమాత్రమై యున్నదో యప్పుడు కారణమునం దున్న భావ ములన్నియు యాకార్యమునందుఁగూడ నవశ్య ముండును ఇదియేప్రపంచమందలి యెల్లవస్తువులలో మూఁడేసి మూఁడేసి భావములు గనుపడుచుండుటకుఁ గారణమై యున్నది. కార్య బ్రహ్మమందుఁ బ్రకృతిపురుషులలీల యీగుణభావలీలారూపము

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

గా ముగింపఁబడినది. ఇందుకొఱకై యే మహాత్ముఁడు ప్రకృతి పురుషులతత్త్వమునుగుఱ్తెఱిఁగి ముక్తుఁడగుటకై కోరునో యత నికిఁ బ్రతివస్తువునందు త్రిగుణములుఁ ద్రిభావములునుఁ జూడఁ దగియుండును. లేనిచో ముక్తి కలుగనేరదు. జగత్తునం దనేక గ్రంథము లున్నవి. కాని యీపుస్తకములన్నియుఁ బ్రకృతి మాతయొక్క గ్రంథములను జదువుటకు సహాయమును జేయు నవి మాత్రమే, ప్రకృతియే వాస్తవమగుగ్రంథము. దీనినేకదా మహర్షిజనులు యథార్థముగా గుర్తెఱింగి నిశ్శ్రేయసలాభమును జెందుచుండిరి. దీనినెల్లచోటుల, నెల్లవస్తువులయందును త్రిగుణ విలాసము త్రిగుణతారతమ్యము, మఱియుఁద్రిభావలీల యెప్పుడు చూచెదరో యప్పుడేఁ బూర్తిగాఁ దెలిసికొన నగును. దృష్టాం తముపై విశదీకరించెదను. మన మధ్యాత్మము, మంతవ్యము (ఆలోచింపఁదగినది) అధిభూతము. చంద్రుఁ డధిదైవము ఈ విషయమునుగుఱించి యీవఱకుఁ బ్రథమసముల్లాసమందు విరి విగాఁ బ్రమాణము లీఁబడియుండెను తిరిగి యిచట నిచ్చుట యనవసరము. భగవంతుఁడు గీతలలోఁగూడ "కింతద్బ్రహ్మ కిమ ధ్యాత్మం" యీ మొదలగు ప్రశ్నముల కుత్తరము లిచ్చు నవ సరమందుమూఁడుభావములలీల పూర్ణముగాఁ జూపియున్నాఁడు. ఏది సర్వపదార్థములందుఁ ద్రివిధభావములఁ గనుచున్నదో యదియే పూర్ణదృష్టి. ప్రస్తుతమం దీవిషయమునఁ జాల గందర

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

గోచర మగుచున్నది. తరుచుగా మనుష్యులొక భావమునో రెండు భావములనుమాత్రమో చూచి విచారించెదరు. లేక యొకభావమునుమాత్రమే యొప్పికొని రెండవభావమును ద్రోసివేయుదురు. ఇదంతయుఁ దప్పు. ఏ వస్తువున కధ్యాత్మభావము నిజమో దాని యధిదైవభావము, నధిభూతభావముఁగూడ నిజములుగాఁగలవు. ఎట్లంటి రేని? మనస్సు సత్యమైనయెడల మంతవ్యమును, జంద్రుండును,సత్యములైనవి. నేత్రములు సత్యములైనయెడల రూపతన్మాత్రయుసూర్యుఁడుగూడ సత్యములు. ఎవనికి మూఁడుభావములుఁగూడఁ గనుపడుచున్నవో వాఁడే పూర్ణద్రష్ట. (పూర్తిగాఁజూచువాఁడు) కానిచోఁ బూర్ణదృష్టిలేనివాఁడగుచున్నాడు. ఈప్రకారముగా దేని యొక్కొక్కయుపదేశమునందు మూఁడేసిమూఁడేసి భావములుండునో యదియే పూర్ణగ్రంథ మని చెప్పఁబడును.అట్టి యాసమగ్రభావములతోఁ గూడికొనినగ్రంథమే భగవంతునివాక్యము గాఁగలదు. లౌకిక పుస్తకములం దీపూర్ణత రాఁజాలదు. గీతలో నొక్కొక్కశ్లోకమందు మూఁడేసిభావములు నిండియున్నవి. ఏలయన! గీత భగవద్వాక్యము. దీనిని బరిశోధింప నపేక్షగలవారు నంతర్దృష్టిసంపన్నులైన జనులును దెలిసికొనఁజాలుదురు. ఈవిధముగా వేదముయొక్క ప్రతిమంత్రమునందును మూఁడేసిభావములు(అధ్యాత్మాధి దైవాధిభూతములు,) నిండియున్నవి. కేవలమొక

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

భావమే కాని కేవలము రెండుభావములే కాని యున్నట్టి మంత్రమొకటిగూడ నీవేదమందు దొరకదు. "త్రయోఽర్థాస్సర్వవేదేషు" ఎల్లవేదములందాధ్యాత్మికాధిదైవికాధిభౌతికము లను మూఁడుభావార్థము లున్న వని శ్రుతులయందు వచింపఁబడినది. స్మృతులలోఁగూడ

"యథా దుగ్ధంచ భక్తంచ శర్కరాభి స్సుమిశ్రితం కల్పితం దేవ భోగాయ పరమాన్నం సుధోపమం తథా త్రైవిధ్య మాపన్న శ్రుతిభేద స్సుఖాత్మకః నయతే బ్రాహ్మణం నిత్యం బ్రహ్మానందం పరాత్పరం"

అని చెప్పఁబడినది ఏప్రకారము పాలు బియ్యము, చక్కెర యీ మూఁడిటిని గలుపుటచే మిక్కిలి మధురము, దేవభోగమునకుఁ దగినదియు నగు పరమాన్న మగుచున్నదో యట్లే యాధ్యాత్మము, ఆధిదైవము, ఆధిభూతములను నీమూఁడుభావములతోఁ గూడినదియు, నమృతమయము నగు వేదము జ్ఞానియగు పురుషునకు బ్రహ్మానందమును గల్గించుచున్నది. దీనింబట్టి వేదమునందలి ప్రతిమంత్రమునకు మూఁడురీతుల నుండు భావములు, మూఁడువిధములుగా నుండు నర్థములు గల వని స్పష్టమగుచున్నది. ఈమూఁడుభావములు మనుష్యులకు సాధారణముగా బుద్ధికి గోచరించునవి గావు. నవీనకాలమున వేదముల యథార్థస్థితిని దెలిసికొనలేక జను లీవిషయమున

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

విశేషముగా భ్రమపడుచున్నారు.

కొందఱు యావచ్ఛ్రుతులను స్థూలమగు నధిభూత భావమునం దర్థముచేయుచున్నారు. కొందఱుక్లిష్టముగాఁగల్పన మొనరించి సర్వమంత్రముల నాధ్యాత్మికభావమునం దర్థముచే యుచున్నారు, ఇదంతయుఁ బూర్ణముగా నిదియు మానవసంబం ధమైనదియునగు బుద్ధిలక్షణము. వేదము మనుష్యకృతమైనచో నిట్టికల్పనము సత్యముగాఁగలదు. వేద మపౌరుషేయము. పర మేశ్వరకృతమునైనందువలన నిట్టికల్పన మెల్లరీతుల నసత్యము. మఱియుఁ ద్రివిధభావపూర్ణవిలాసమే సత్యమైయున్నది. ఒకదృ ష్టాంతముతో బోధింపఁబడుచున్నది.

> ద్వయా హ ప్రాజాపత్యా దేవా శ్చాసురాశ్చ తత్ర కానీయసా
> ఏవ దేవాః జ్యాయసా అసురా స్త ఏషు లోకేష్వస్పర్ధంత॥
>
> (ఇత్యాది బృహదారణ్యకోపనిషత్తు.)

ప్రజాపతినుండి దేవతలును, రాక్షసులును నిరువురును జన్మించిరి. వారియందు దేవతలు దమ్ములుగాను రాక్షసులన్న లుగానున్నారు. వీరిరువురు నీలోకములందు. బరస్పరము స్పర్ధ తోనుందురు. ఈ మంత్రమునందు సురలయు నసురులయు సంగ్రామము వర్ణింపఁబడియున్నది. దీనిని గేవల మొకభావము నందే గ్రహించుటవలన సంపూర్ణమైన యర్థముగానేరదు. ఈ మంత్రమును మూఁడుప్రకారములుగానుండు భావములందును



CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

సమన్వయింపవలయును. ఈ భౌతికప్రపంచమం దాభగవద్గీత లలోఁ జెప్పఁబడిన దైవీసంపత్తిగల జీవులకును, ఆసురీసంపత్తి గల జీవులకును నిరంతరము కలహమగుచునేయుండును, ఇదే దీని కధిభూతార్థము. సరిగా నీప్రకారముగానే దేవలోకమం దా తమోగుణము నధిష్ఠించిన యసురులకు సత్త్వగుణము నధి ష్ఠించినదేవతలకును బరస్పరము జగడము జరుగుచుండును. అనఁగా నీరెండువిధములగు చేతనశక్తులకయ్యమే, యధిదైవ మగు దేవాసురసంగ్రామమని గ్రహింపవలెను.

ఇఁక మూఁడవభావమేమన? అధ్యాత్మము (మనోరా జ్యము) నందుదేనిచే జనులొకప్పుడు కుమతిచక్రములోనికివచ్చి పాపముఁ జేయుచున్నారో మఱియొకప్పుడు సుమతిమూలము నఁ బ్రేరేపింపఁబడి చేసినపాపములకుఁ బశ్చాత్తాపముఁ జెందు చున్నారో, యట్టికుమతికిని, సుమతికిని ద్వంద్వయుద్ధ మెప్పు డును జరుగుచునేయుండును. ఈ కలహ మధ్యాత్మరాజ్యమందు దేవాసురయుద్ధమైయున్నది. ఈప్రకారముగా మూఁడేసిభావ ములు చూచినప్పుడు వేదమంత్రములకుసంపూర్ణముగా నర్థము గాఁగలదు. కానిచోఁగాదు. పూర్ణుఁడును భావమయుండునునగు భగవంతుని నిశ్వాసరూపమైన వేదమునందంతట నిట్టిత్రివిధభా వములనుగాంచి భక్తజనులహృదయము చక్కఁగా వికసించు చున్నది. తేలినసారాంశ మేమనఁగా? ఇంతవఱకుఁ జర్చించిన

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

చర్చననుసరించి వేదములందుఁ త్రిగుణపూర్ణతయుఁ త్రిభావ పూర్ణతయు నగుటవలన వేదమున కపౌరుషేయత్వము సిద్ధించినది.

## — { వేదములందలి యింద్రవరుణాదిదేవతల విషయమునందుఁ దాత్పర్యమేమి? } —

ఇట్లింత గంభీరముగా నుండిన వైదికతత్త్వమును దెలిసికొనుటకుఁ దొలుత నెట్టిశిక్షఁ బొందవలయునో యది యీదిగువ వ్రాయఁబడుచున్నది. మొట్టమొదట, శిక్ష, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, ఛందము, జ్యోతిషముననునీయాఱంగములను మిక్కిలిశ్రద్ధతో నధ్యయనమొనర్చి తర్వాత వేదార్థములను దెలిసికొనుటకు శక్తిని సంపాదింపవలసియుండును. ఈయాఱంగములలో నొక యంగమందైనను గొఱతపడినచో నట్టి విద్వాంసునిశక్తి పూర్ణముగానేరదు. ఈషడంగజ్ఞానలాభము బొందిన యనంతరమున సప్తదర్శన (శాస్త్రము) ములయొక్క జ్ఞానము చక్కగా గడింపవలసియుండును. వేదముచేఁ జెప్పఁబడిన యీసప్తదర్శనములు పరదేశీయులదర్శనములవలె నాకాశరమ్యహర్మ్యములు గావు. ఈయేడుదర్శనములు జ్ఞానభూమియందు వరుసగాఁ బ్రవేశింపఁజేసెడి సప్తాధికారములనుండి పుట్టినవి. ఈప్రకారముగా షడంగములయు సప్తదర్శనములయు రహస్యములను బరిపూ

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

ర్ణముగా హృదయమందు నాటింపఁజేసికొనినపిమ్మటను, గర్మ ము, నుపాసనము, యోగము మున్నగువాని తోడ్పాటుచేఁ జిత్తము నిర్మలమైన తరువాతను సంపూర్ణజ్ఞానముతోఁ గూడి కొనిన వేదములు లభింపఁగలవు. అట్లుకాదేని ననంతంబు, నం తులేని గంభీరముగల వేదసముద్రముని పార మెఱుంగుట యను నదేమి? దానియందుఁ బ్రవేశించుటగూడ సంభవింపదు.

వేదమునం దాయాఋషులయు, ఛందస్సులయు, దేవ తలయు వర్ణనము వచ్చియున్నందువలన నేర్పడు తాత్పర్యమిది యైయున్నది. ఏయే త్రికాలదర్శులగు మహర్షుల చిత్తమునందు స్వతంత్రములగు శ్రుతు లాదియం దావిర్భావమొందినవోఁ అనఁగా నే యే యాచార్యులమూలమున నా మంత్రములు ప్రకాశపరుపఁబడినవో వారే యా మంత్రములకు ఋషులుగాఁ జెప్పఁబడుచున్నారు. ఏయేఛందస్సులం దేశ్రుతులు వచింపఁబడి నవో యవి యవి యాయావేదమంత్రములకు ఛందస్సులుగాఁ బలుకఁబడినవి. మఱియు నేయేశ్రుతులద్వారమున నేయేభగవ చ్ఛక్తుల యుపాసనమగునో యాయుపాసింపఁదగిన శక్తు లా యాశ్రుతులకు దేవతలుగాఁ జెప్పఁబడిరి. ఈనియమము నను సరించి యొక్కొక్కమంత్రమునకుఁగూడ ఋషులను, దేవత లను ఛందస్సులనుచ్చరించెడి విధి వేదమునందుఁ గన్పడుచున్నది. దీనిప్రయోజనమేదన? ఛందస్సుల నెఱింగినవాఁడగుటవలన

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

నామమంత్రముయొక్క యాధిభౌతికశక్తిజ్ఞాన మతనికబ్బుచున్నది. ఎందువలనననఁగా వైదికమగునొక్కొక్క ఛందస్సుశక్తి ప్రత్యేక ప్రత్యేకముగానున్నది. చెప్పఁబడినఛందము ననుసరించి స్వతంత్రముగాఁ గార్యములను జేయుటకై యేర్పాటు, వేదమందలి బ్రాహ్మణమను భాగమం దనేకప్రకారములుగానున్నది. దేవతలను దెలిసికొనుటచేత నుక్తమంత్రాధిదైవికశక్తియు, ఋషుల నెఱుంగుటవలన నుక్తమంత్రాధ్యాత్మికశక్తియు బోధయగుగుచున్నది. వేదములోఁ గర్మకాండయందుఁ గాని యుపాసనాకాండయందుగాని స్వర్గాదిఫలముల నొసంగునవియుఁ గోరికలతోగూడినవియునగు సాధనముల ననేకరీతులుగా వర్ణించియుండుటచేత వానియందు నింద్రుఁడు, వరుణుఁడు, అగ్నిమున్నగు దేవతల శక్తులయొక్క స్తోత్రములు చెలఁగుచున్నవి. ఈరహస్య మెఱుంగలేక వ్యర్థముగా వేదజ్ఞానాభిమానులగు పెక్కుమందిచే ధాతువుల కనేకార్థము లుండుటంబట్టి దేవతానామములన్నియు నొక యీశ్వరునిపరముగనే సమన్వయించి వర్ణింపఁబడినవి. సంస్కృతభాష కామధేనువువలె మనోరథములను దీర్చునదియైనప్పటికి దానిసంపత్తినిబొంది యిచ్చవచ్చిన యాచారముసందపేక్షతోనుండుట గుణముగానేరదు. విశేషమేమన? ధర్మమును శాస్త్రమును మఱుగుపరచుటయే యగును. కేవలము భాషను ధాతువులను నేర్చుకొన్నంతమా

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

త్రిమున వేదమునందలి జ్ఞానము పట్టుపడనేరదు. వేదమును దెలిసికొనుటకు మోగముతోఁగూడిన బుద్ధిగలవారై దాని యత్యంతగంభీరప్రదేశమందలి రహస్యమును నిర్ణయింపవలెను.

"ఉత త్వః పశ్య న్న దదర్శ వాచ
ముత త్వః శృణ్వన్ శృణో త్యేనాం
ఉతో త్వస్మై తన్వం విసస్రే
జాయేవపత్య ఉశతీ సువాసాః॥ [ఋ॥ దశమమండలము.]

చాలమంది వేదమును జూచియు సరిగాఁ జూడలేరు. అనేకులు దానినివినియు సరిగావినలేరు. పతివ్రతయగు సతి యంగ మామెపతియే చూడఁజాలినట్లు వేద మేపురుషుని యథార్థాధికారినిగాఁదలఁచునో యట్టిభాగ్యశాలికే తనరూపమును జూపును. అతఁడే శ్రుతితాత్పర్యమును జక్కఁగాఁ దెలిసికొనెడివాఁడు. ఇతరుఁడు గాఁజాలఁడు. ఇప్పు డెల్లవేల్పులపే ళ్లొక యీశ్వరునినామమేమైనచో వేలువేలుపేరులతో స్తుతిజేసినందువలన లాభమేమి? యనిధీరులును నిష్పక్షపాతులును విచారింపఁదగిన విషయమైయున్నది. అందులకుఁ గేవల మీశ్వరుని నామమును దద్వాచకములగు కొన్నివిశేషణములే యవసరమగును. మఱియుఁ బ్రత్యేకమగునామమునం దేధాతువు దొరకుచున్నదో దానిని విపరీతరీతిని దాఱుమాఱుజేసి మిక్కిలి కష్టమగు కల్పనతో దానికర్థములను జేయుటగూడ ననవసర

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

మగును. యావత్తుబుక్కులు కేవలము జ్ఞానకాండము ప్రతిపాదించునవియైయున్నచో వేదమంత్రములును జాలదక్కువయై పోవును. మఱియు సన్నిటికంటె నెక్కువగా నున్నకర్మకాండ విస్తారముగానుండుట సంభవింపదు. జగమునకాదికారణుండగు పరమేశ్వరుండు త్రిగుణమయియైన ప్రకృతికంటె బరుఁడైనవాఁడనియు నతనిశక్తి నిధరించియే దేవతలు, ఋషులు, పితరులు, నీప్రపంచమును రక్షించుచున్నారో వారందఱు ప్రకృతియందే కలరనియు వేదరహస్యమెఱింగెడి విద్వాంసులకుఁదప్పక తెలియఁగలదు. ఇందువలన, స్వర్గము మున్నగువానినిగోరు సకామసాధకులకొఱకు దేవతలను ప్రసన్నులుగాఁ జేయుట మిక్కిలి సహజమైయున్నది. ఎవనిచిత్త మిహలోకమందుఁగాని పరలోకమందుఁగాని భోగములను, సుఖములను, సంపత్తినిఁ గోరుచున్నదో యట్టిపురుషునకు దేది మిక్కిలిసరళమైనదియో యెందుఁగష్టమెక్కువలేదో, దేనియందును సిద్ధిగూడ జిక్కునోయట్టి యుపాయమే మంచిదని గ్రహించుననెడిమాట నిశ్చయము. భగవంతుఁడు గీతలలో నీరీతిగా వ్రాయుచున్నాఁడు.

> " కాంక్షన్తః కర్మణాం సిద్ధిం యజన్త ఇహ దేవతాః
> క్షిప్రం హి మానుషే లోకే సిద్ధి ర్భవతి కర్మజా॥
> కామైస్తైస్తై ర్హృతజ్ఞానాః ప్రపద్యంతేఽన్యదేవతాః
> తం తం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతాః స్వయా॥

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

అంతవత్తు ఫలం తేషాం తద్భవ త్యల్ప మేధసాం
దేవాన్ దేవయజో యాన్తి మద్భక్తా యాన్తి మామపి॥

సకామకర్మయందు సిద్ధినిఁగోరి ప్రవృత్తియం దాసక్తిగల జనులు దేవతలను సంతుష్టిపరచుటకై యజ్ఞ మొనరించుచున్నారు. ఏలయన ఈయుపాయమువలనఁ గార్యసిద్ధి తొందరగా నగును. ఈరీతిగానే కోరికలతోడను, భావములతోడను గూడికొనిన ప్రకృతియొక్క ప్రేరణచేత ముగ్ధులైన యీ జనులు దేవతాసాధనమును జేయుచున్నారు. కాని యిట్లుపొందినలాభము నాశము గలదగును. ఎందులకన దేవయజ్ఞముకావించువారు దేవలోకమునకుఁ బోవుచున్నారు. నాభక్తజనులు నాపరమ ధామమునకే వచ్చుచున్నారు. ఏప్రకారముగా నీచఫలమును గోరెడిజనులు రాజుకడ నొక చిన్నకొలువులోనున్న పురుషుని నాశ్రయించియే తమకార్యమును నెరవేర్చుకొనుచున్నారో వారికెట్లు చక్రవర్తికడకుఁ బోవలసిన యవసరములేదో వారును బోఁజాలరో యాప్రకారముగానే క్షుద్రవాసనగల తక్కువ రకపు సకామసాధకులకు భగవదంశరూపులగు దేవతలయుపాసనయే తగినదియై శీఘ్రముగా ఫలమును గలిగించునదియు నై యున్నది. ఇట్లంగీకరింపవలసియే యుండును. రెండవవిషయ మేమన? వేదమునం దింద్రుఁడు మున్నగుదేవతలను సంతుష్టిపరచి కోరికలీడేర్చుకొనుటకేయుక్తులు చూపఁబడియున్నవో

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

యీ యుక్తులమూలమున దైవికశక్తియే ప్రసన్నము గాఁగల దని యనుభవశాలురగు జను లెఱుంగుచున్నారు. అవి భగ వంతుని దృప్తిపరచుటకుఁ జాలవు. అందువలన నామంత్రము లన్నిఁటిని భగవంతునినామమందే ధాతువున కర్థాంతరము గల్పించి సంబంధింపఁజేయుట వేదమందలి రహస్యజ్ఞానములేక పోవుటకు సూచనగానున్నది. ఇట్లెన్నటికిని జేయఁగూడదు. ధీరుఁడై దైవీశక్తివిలాసముపై సంయమ మొనరించి యెల్లవిషయ ములను జూడవలెను. విచారణీయాంశ మేమన? చుంబకశక్తి విద్యుచ్ఛక్తి మున్నగు సాధారణజడశక్తులనుపయోగించి జనుల బుద్ధిగిఱ్ఱుగిఱ్ఱునఁ దిరిగిపోవునట్లుగా నవీనపదార్థవిద్యా (సైన్సు) ధురీణులచే నద్భుతములుచేయఁబడిచూపింపఁబడుచున్నవి, భౌతి కశక్తియందే యింతసామర్థ్యమున్న యెడల దైవికశక్తియం దిం కెంత సామర్థ్యముండునో దానిని విచారశీలుఁడగు జనుఁడే గ్రహింపఁగలఁడు. స్థూలజగత్తునందు భౌతికశక్తినలె సూక్ష్మ జగమునందు దైవీశక్తి ప్రపంచరక్షణముకొఱకెరీతిని బనులఁ గావించునో యదియంతయుముందుముందుఁ జూపెదము. మను ష్యుఁడుయజ్ఞానుష్ఠానము మున్నగువానిమూలమున నాశక్తులను బ్రసన్నముజేసికొని సుఖమును, సంపత్తిని, మనోరథమును బొందఁగలఁడు. శ్రుతియందులకే యుక్తినిజూపించినది. కాఁబట్టి



CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

యీనామములన్నియు దేవతలవే. రెండియు స్తోత్రముగూడ దేవతలను దృష్టిపఱచుటకొఱకేమైయున్నది. ఎచట జ్ఞానయజ్ఞమును సాధించుటయందైన నుపనిషత్తులచేఁ జెప్పబడిన జ్ఞానాధికారము లేక యాధ్యాత్మికముయొక్క తత్వమును వర్ణించుటయందైన, నింద్రాదినామము లుపయోగింపఁబడియుండునో యచట నింద్రాదిశబ్దములు పరమాత్మనుగూర్చి చెప్పునవియే కాఁగలవు. సందియ మిందేమియులేదు. ఎట్లంటిరేని?

ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే॥

ఈ మంత్రమునందున్న యింద్రశబ్దము సృష్టిసమయములో మాయాసహితుఁడై యనేకరూపముల ధరించెడిపరమాత్మనుగూర్చి చెప్పునదియైయున్నది. ఈవిషయ మాధ్యాత్మికసృష్టిజ్ఞానములకు సంబంధించినదియై యున్నందువలన నిట్టి యర్థమైనది, సకామములగు దైనయజ్ఞము మున్నగువానిలో నిట్లు కానేరదు,

వేదభాష సాధారణమగు సంస్కృతభాషకంటె నొకవిధమైన యపూర్వతయు విలక్షణత్వమును గలిగియున్నది. దీనిపై విచారణజేసినయెడల వేదభాషయొక్క లోకవిలక్షణత్వమును, భావగాంభీర్యమును స్వయముగనే ప్రమాణితము లగుచున్నవి. మనయార్యజాతులవారి విచారణమునుబట్టి సృష్టిమొదటికాలమునుండియే వేదసంబంధ మంగీకరింపఁ బడుచున్నది.

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

JNANA SIMHA... JNANAMANDIR
LIBRARY
Jangamawadi Math, Varanasi
Acc. No. 8130



"యుగాంతేంతర్హితా న్ వేదా న్ సేతిహాసా న్ మహర్షయః
లేభిరే తపసాపూర్వ మనుజ్ఞాతా స్స్వయంభువా"

మహర్షులు బ్రహ్మదేవునియనుమతిని గొని సృష్టికిఁ
బూర్వమునఁ బ్రలయకాలములో నంతర్హిత (మఱుగుపడియుం
డుట) ములై యితిహాసములతోఁ గూడికొనిన వేదములను దప
స్సుజేసి పొందిరని స్మృతి చెప్పుచున్నది. పాశ్చాత్యపండితులు
వేదము జన్మించినకాలమును నిర్ణయించుట కెక్కువగా బుద్ధిని
వ్యయపఱచియున్నారు. పాండిత్యాభిమానులగు పశ్చిమాయ
ధీమంతులు గొందఱు క్రీస్తుపుట్టుటకుముందు రెండువేలయేండ్ల
క్రిందట వేదము బయలుదేరినదని చెప్పిరి. మఱిగొందఱు మఱి
యొకవిధముగాఁ బలికిరి. అయితే యొకరిసిద్ధాంత మింకొకరి
సిద్ధాంతమునకు సరిపోవుటలేదు. ఒకరికిఁ గూడ నంతుచిక్కలే
దని తాత్పర్యము. మఱియుఁ జిట్టచివర కందఱు భూలోకమందు
వేదముకంటెఁ బ్రాచీనమైన గ్రంథమేదియుఁ గంటఁబడుటలేదని
చెప్పవలసివచ్చినది. మొత్తముమీఁద భ్రమరహిత వైదికవిజ్ఞాన
ముయొక్క యనాదిత్వమును, వైదికభాషయొక్క యతిప్రాచీ
నత్వము నీప్రపంచమందలి యెల్లబుద్ధిమంతులును విద్వాంసులు
నైకకంఠ్యముగా నొప్పుకొనుచున్నారు. వేదమునందు జ్ఞాన
విజ్ఞానములు రెండును విస్తరించి వర్ణింపఁబడియున్నవి అఘట
నఘటనాపటీయసియగు మహామాయ (ఈప్రపంచమునిజమని

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

తోపింపుమాను) కు విలాసస్థలమును, ననంతమైనయాకసము తోడను, గ్రహములు, నక్షత్రములు మున్నగువాని లోకముల తోడను బాగుగా విరాజిల్లునదియు నగు నీజగ మేప్రకారముగా నంతములేనిదియో యాకీతిగా వేదస్వరూపముగూడ నంతు లేనిదియే. కేవల మొకజ్ఞానదృష్టితోడనే మే మీ ప్రపంచము ననంతముగాఁ జూచుచున్నాము. తొలుత జ్ఞానవిస్తారమువలన నీస్థూలజగత్తే యనంతమైనది. తిరిగి జ్ఞానముతో సంబంధించి యున్న యధ్యాత్మరాజ్య మీబాహ్యజగత్తుకంటె నింకనువిస్తృతముగా నుండుట సంభవమగును. ఇంతేకాక యెప్పుడు వేదములందు జ్ఞానవిజ్ఞానముల రెంటియొక్కయు వర్ణన మున్నదో యప్పుడు వేదరూపియైన శబ్దబ్రహ్మ మెంతయనంతరూపధారి గాఁగలదో విచారశీలుఁడగు పురుషుఁడు మాత్రమే దానిని దెలిసికొనఁగలఁడు. ఇందులకు శ్రుతి యిట్లువచించుచున్నది.

## —(*) వేదవిభాగశాఖానిర్ణయము (*)—

"అనంతా వై వేదాః" వేదము లనంతములు. వేదము లనంతము లైనప్పటికి నీకల్పమందు వేదములసంఖ్య గన్పట్టుచున్నది. ఈసంఖ్యావిషయమునందభిప్రాయభేదములునుగలవు. మహాభాష్యమునం దిట్లు వ్రాయబడియున్నది.

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

"చత్వారో వేదాః సాంగాః సరహస్యా బహుధా భిన్నాః
ఏకశత మధ్వర్యుశాఖాః సహస్రవర్త్మ సామవేదః
ఏకవింశతిధా బాహ్వృచ్యం నవధా అథర్వణో వేదః"

అంగములతోడను రహస్యములతోడను గూడిన నాలుగు వేదములు బహుశాఖలుగా విభాగింపఁబడినవి. ఎట్లాంటి దేని యజుర్వేదమునకు నూటనొకటిశాఖలును, సామవేదమునకు వేయిశాఖలును ఋగ్వేదమున కిరువదియొకటి శాఖలును మఱియు నథర్వణవేదమునకుఁ దొమ్మిది శాఖలునుగలవు. స్కాందపురాణమందిట్లు వ్రాయఁబడినది.

'అవతీర్ణో మహాయోగీ. సత్యవత్యాం పరాశరాత్
ఉత్పన్నా న్భగవా న్వేదా, నుజ్జహార హరి స్స్వయం॥
ఋచ స్సఋచ ముద్ధృత్య, ఋగ్వేదం కృతవాన్ ప్రభుః
యజూంషి నిగదా 
చ్చైవ, తథా సామాని సామతః॥
చతుర్థావ్యభజత్తాంశ్చ, చతుర్వింశతిధా పునః
శతధా చైకధా చైవ, తథైవ చ సహస్రధా॥
కృష్ణో ద్వాదశధా చైవ పున స్తస్యార్థవిత్తయే
చకార బ్రహ్మసూత్రాణి యేషాం సూత్రత్వ మంజసా॥

దీనిననుసరించి యొకటిగానున్న వేదము తొలుత వ్యాసులవారిచే నాలుగుభాగములుగా విభాగింపఁబడినది. తరువాత నవియే ఒకవేయినూటముప్పదొకటి భాగము (శాఖ) లైనవి. ఎట్లన ఋగ్వేదమున కిరువదినాల్గు శాఖలును, యజుర్వేదమునకు నూటయొకటి శాఖలును, సామవేదమునకు

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

వేయి శాఖలు అథర్వవేదమునకుఁ బన్నెండు శాఖలును నైనవి. ముక్తికోపనిషత్తులో వేదమునకు బదునొకండువందల యెనుఁబది శాఖలున్నట్లు ప్రమాణము చిక్కుచున్నది.

ఋగ్వేదస్య శాఖా స్స్యురేకవింశతిసంఖ్యకాః
నవాధికశతం శాఖాయజుషో మారుతాత్మజ॥
సహస్రసంఖ్యయా జాతాః శాఖా స్సామ్నః పరంతప
అథర్వణస్యతు శాఖా స్స్యుః పంచాశ ద్భేదతో హరే॥

ఋగ్వేదమునకు కిరువదియొకటి శాఖలును, యజుర్వేదమునకు నూటతొమ్మిది సామవేదమునకు వేయిశాఖలును అథర్వవేదమున కేఁబది శాఖలునుగలవు. అయితే వర్తమాన కాలేయకాలమహిమచే వేదముల కిన్ని శాఖ లున్నప్పటికి నేఁటి కాలమునఁ గేవలమేడో యెనిమిదో శాఖలుఁ గంటబడుచుండుట మిగుల విషాదకరవిషయముగానున్నది. వేదముయొక్క యావిర్భావ, తిరోభావములు జీవులకర్మమునననుసరించి జరుగును. ఇది మనపాపముయొక్కయు, సంశయాత్మికమైనబుద్ధి యొక్కయు ఫలమైయున్నది. ఎందులకన? ఇతరయుగములందు వేదములకిన్ని శాఖలున్నప్పటికి నీయుగమందు లెక్కకు మిక్కిలి తక్కువగానుండు శాఖలు చిక్కుటంబట్టియే. వేదార్థము మిక్కిలి చక్కగాబోధపరచుకొనుటకుఁ బ్రారంభమై వేదరహస్య మెఱుగఁబడి వెంపియు, వేదవిద్యకు వైదికధర్మమునకుఁ బూర్తిగాఁ బ్రచారముగలిగినచోఁ దిరిగి పూర్వకాలమువలె

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

సహస్రులు బయలుదేరి వేదమును బహిష్కారింపఁగలరు. ఇందు సందియము లేదు. వర్తమానసృష్టిలోని యీకల్పమున నెన్ని శాఖలలో సహస్రరూపేయంబగు వేదము విస్తరించియుండినదో యాయొక్కొక్క శాఖకునుస్వతంత్రమైనమంత్రభాగము, బ్రాహ్మణభాగము, ఆరణ్యక (ఉపనిషత్) భాగమును వేదాంగము దు సూత్రములను బ్రాతిశాఖ్యలోని భేదసమూహమును విచారించినయెడల నీకల్పమునందుఁగూడ వేదమునకెంత గొప్పవిస్తృతియుండినదో తెలియఁగలను. ఎల్లవారికి హితమును గలిగించెడి వేదమునందు జ్ఞానమునకు సంబంధించిన యనంతవిషయములున్నను విజ్ఞానమునకుఁజెందిన మిక్కిలి రహస్య విషయములును గలవు. ఇంతియేకాక వేదభాష మిక్కిలి సారముగలదియు, సంక్షిప్తమును, గంభీరమును మఱియు నైజ్ఞానిక భావసహితమునయిన కారణమువలన సాధారణమగు బుద్ధికి గోచరించునదిగాదు. ఈ హేతువునుబట్టి యల్పజ్ఞులగువిద్వాంసులు వేదార్థమును గ్రహించుటయందనేకరీతులుగా విచలితులైనందువలన వారియందు మతభేదములు ననేకసందేహములు మఱియుఁ బ్రమాదముగలవృత్తులునుబుట్టుచున్నవి. కాని వాస్తవమునకు శబ్దబ్రహ్మరూపియైన వేదము సాక్షాత్సాకార బ్రహ్మరూపియేసుమీ. ఏప్రకారముగా నేకము, నద్వితీయము నగు బ్రహ్మము, త్రిగుణభేదమునసనుసరించి బ్రహ్మ, విష్ణు, శివ

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

లను త్రిదేవతలరూపమునుధరించి సృష్టి స్థితి లయములనెడి కార్యములనుజేయుచుండునో యాప్రకారముగా నపౌరుషేయ మగు వేదముగూడ, ఉపాసనము, కర్మము, మఱియు జ్ఞానము లను బ్రకాశపరచుటకు సంహితా, బ్రాహ్మణోప నిషద్రూప ములైన త్రిమూర్తులఁదాల్చి యానత్ప్రపంచమునకు సుఖము గల్గించుటకుఁ బ్రవర్తించుచున్నది

వేదము త్రిభాగములుగావిభాగింపఁబడినది. మంత్రభాగము బ్రాహ్మణభాగము నారణ్యకభాగములని. ఆరణ్యకము లే యు పనిషత్తులకు మూలములు. ఆరణ్యకభాగమునందు బ్రహ్మత త్వమును దెలియఁబరచుట కే మూలసూత్రములుగలవో వాని విపులీకరణమే యుపనిషత్తులందుఁ జేయఁబడినది. ఉపనిషత్తులు నివృత్తిమార్గము నవలంబించువారలకును వానప్రస్థులకును, సన్న్యాసులకును, సంగ్రహింపఁబడినవి. దేనిద్వారమున బ్రహ్మ సామీప్యలాభమగునో యద్దానికి "ఉపనిషత్తు" అనిపేరు. దీనికి మూలముగానున్న యారణ్యకభాగమునకు ఆరణ్యకమను పేరెందులకు వచ్చినదనఁగా పురాతనకాలమందనేకతపోవనము లుగలవు. వానప్రస్థులానవములందే నివసించుచుండిరి. మఱియు సన్న్యాసులుగూడ నందేసంచరించుచుండెడివారు. అందుచే నది యరణ్యమునందే ప్రకాశపరుపఁబడినది. కాన దానికి 'ఆరణ్యక' మని పేరువచ్చినది. పరమపవిత్రములైన యుపనిషత్తుల సమూ

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

హము మోక్షపదమును బొందుటకుఁ బ్రధానసాధనమైయు న్నది. బ్రాహ్మణభాగము, సంహితాభాగమును ముఖ్యముగాఁ గర్మిష్ఠులకు, నుపాసకులకును బట్టుఁగొమ్మ. విచారింపఁగా యావద్వేద మొక్కటియే. అట్లైనను గర్మాధికారభేదముచేత నిదివరకుఁ జెప్పినట్లు సాకలిత (సాఖ్యగాఁగూర్పఁబడిన) మైనది. ఋక్కు, యజుస్సు, సామము, నథర్వములను నివిగూడ నా యా పేరులతోఁ జెప్పఁబడు నాలుగుప్రకారములుగా నున్న స్వతంత్రములగు శ్రుతులను విభాగించుటవలనఁ జతుర్వేదము లని చెప్పఁబడుచున్నవి. యథార్థమునకు మూఁడుభాగముల తోడను, నాల్గు సంఖ్యలతోడను గూడి కొనినవేద మొకటియే సుమీ. ఋక్కు, యజుస్సు సామము, అథర్వములవరుస ననుసరించి శాఖలకే సంఖ్యయిది వఱకుఁ జెప్పఁబడియుండెనో దానిలోఁ బ్రత్యేకశాఖకుఁ బ్రత్యే కప్రత్యేకముగా మంత్రభాగము, బ్రాహ్మణభాగము, నారణ్య కభాగమునుండినవి. కాని యీకల్పము దెంత వేదము ప్రకటమై యుండెనో యందులో సహస్రాంశముగూడఁ జిక్కుటలేదు. మనజాతీయ దౌర్భాగ్యముచేతను ననేకదేశోపద్రవములచేతను దుర్ఘటనములచేతను. వేదమందలిప్రధానాంశములు లోపించి పోయినవి. అట్లయినప్పటికిని నిప్పుడెన్నియంశములు చిక్కుచు

8

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

న్నవో యనిగూడ నిట్టియాపత్కాలమున నార్యజాతికి విశేష కల్యాణప్రదంబులైయున్నవి.

ప్రస్తుతము చతుర్వేదవిషయము సాధ్యమగునంతవఱకుఁ గొంతవర్ణింపఁబడుచున్నది. ఋగ్వేదసంహిత పదిమండలములుగా విభజింపఁబడినది. ఆమండలములందు ౮౫ అనువాకములుగలవు. అనువాకసమూహమందు ౧౦౨౮ సూక్తములు గనుపడుచున్నవి. నేటికాలములోఁ బ్రచారమందున్న గ్రంథములందు ఖండము, పరిచ్ఛేదము, మఱియుభిన్న భిన్న విషయములెట్లు చెప్పఁబడుచున్నవో వానికి మండలము, అనువాకము, సూక్తములనునవి యనురూపములై యున్నవి. ఋగ్వేదముయొక్క ప్రథమమండలమునందు ౨౪ ద్వితీయమునందు ౪ తృతీయమునందు ౫, చతుర్థమునందు, ౫, పంచమ, షష్ఠ, సప్తమములలో నొక్కొక్కదానియందు ౬, అష్టమమునందు ౧౦ నవమమందు ౭ మరియుఁ బదియవమండలమునందు ౧౨ అనువాకములుగలవు. ఒక్కొక్క మండలమందలి సూక్తసంఖ్య చెప్పఁబడుచున్నది. మొదటి మండలము ౧౯౧, రెండవదానియందు ౪౩ మూఁడవదానియందు ౬౨, నాల్గవదానియందు ౫౮ ఐదవదానియందు ౮౭, ఆఱవదానియందు ౭౫, ఏడవదానియందు ౧౦౪, ఎనిమిదవదానియందు ౧౦౩, తొమ్మిదవదానియందు ౧౧౪, మఱియు, బదియవ మండలమునందు

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

౧౯౧ సూక్తములున్నవి. సూక్తమున కనేకభేదములున్నవి. మహాసూక్త, మధ్యమసూక్త, క్షుద్రసూక్త, ఋషిసూక్త, ఛ్ఛందస్సూక్త, దేవతాసూక్తములని వానినామములు. మండలము, అనువాకము, సూక్తము మున్నగువానితోఁగూడ శాస్త్రమునందు ఋగ్వేదమంత్రసంఖ్యయు, ప్రత్యేకమంత్రపద సంఖ్యయు శబ్దాంశపరిమాణమును నిర్దేశింపఁబడినవి. కాని యీప్రకారముగాఁ బదసంఖ్యతోడను, శబ్దసమిష్టితోడను గూడిన ఋగ్వేదము నేఁడు చిక్కకుండుట మిగులదుఃఖకరము. ఋగ్వేదమందలి కవితాసంఖ్యనుబట్టియే వర్తమానకాలమున ననేకమతములు మతాంతరములునైనవి. చాలమంది ౧౦౪౦౨ నుండి ౧౦౬౨౮ వఱకు వానిని లెక్కించుచున్నారు, వాని శబ్దములసంఖ్య ౧౫౩౮౨౬ గాను, శబ్దాంశసంఖ్య ౪౩౨౦౦౦ గానుగలదు. అయితే దీనియందు మతభేదముగూడగలదు. వేదవ్యాసభగవానులవారు వేదవిభాగము గావించి ఋక్సంహితను పైలుఁడనుమహర్షికి, యజుస్సంహితను వైశంపాయనుఁడనుమహర్షికి సామసంహిత జైమినియనుమహర్షికిని, నథర్వ సంహితను సుమంతుఁడనుమహర్షికినొసంగి నేర్పినట్లు విష్ణుపురాణములోని మూఁడవ నాల్గవయధ్యాయములందున్నది. వీరిగి పైలుఁడనుమహర్షి ఋగ్వేదసంహితను రెండుభాగములనుజేసి తనశిష్యులగు నింద్రప్రమితి యను వాని కొకభాగమును,

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

వాస్కలుఁడను వానికి రెండవ భాగము నిచ్చియుండెను. జాధ్యుఁడు, అగ్నిమాతురుఁడు, జాతుకర్ణుఁడు, పరాశరుఁడు వీరు నలువురును వాస్కలమహర్షికి శిష్యులైయుండిరి. ఆమహర్షి, తాను నేర్చిన వేదసంహితను నాల్గుభాగములుగా విభజించి తనశిష్యులకు నలుగురకు నేర్పెను. ఇంద్రప్రమితియుఁ, దా నధ్యయనముఁజేసిన వేదమునుదనపుత్రుండగు మాండుకేయునిచే నధ్యయనముఁజేయించెను. పిదప మాండుకేయుఁడు తనసుతుఁ డగు శాకల్యునకును, నిల్లె శిష్యులగు, వేదమిత్రుఁడు, సౌభరి మొదలగువారలకు నుపదేశించె. తిరిగి శాకల్యుఁడుగూడ దాను నేర్చినదానిని నైదుసంహితలనుగాఁజేసి ముద్గల. గాలవ, వాత్స్య శాలీయ, శైశిరులను నామములుగల తన యైదుగురుశిష్యులకు నుపదేశించెను. ఈరీతిని ఋగ్వేదము, వివిధవిధములుగా ననేక శాఖలయందు విభజింపఁబడినది. శాఖలననుసరించి మండలము అనువాకము, మున్నగువానికిఁగూడ బెక్కునామములున్నవి. శౌనకమునిచే రచింపఁబడిన "చరణవ్యూహ" మను గ్రంథము నందు ఋగ్వేద మెనిమిదిభాగములుగా నున్నట్లు లిఖింపఁబడి నది. శ్రావక, చర్చక, శ్రవణీయపార, క్రమపార. క్రమరథ, క్రమజటా, క్రమశట, క్రమదండములని వానినామధేయములు. ఈ సర్వభేదములు నాల్గుపారాయణములుగా విభజింపఁబడినవి. ఋగ్వేదమున నైదుశాఖలు. అశ్వలాయన, సాంఖ్యాయన,

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

శాకల, వాస్కల, మాండూకములని వానినామములు. వానియందు ౬౪ అధ్యాయములును ౧౦ మండలములును ౨౦౬ వర్గములును, ౧౦౧౭ సూక్తములునున్నవి. ౧౫౨౧౫౪ పద క్రమ నాసిష్ఠములును: ౫౮ తదితరములును, ౧౦౫౮౦ ఋక్కులోనిపదములును, "భారాయణ" మను పేరుతో వచింపఁబడినవి. మొదటియష్టకమునందొకవర్గము, నొకఋక్కును, రెండవయష్టకమునందు రెండు వర్గములును రెండు ఋక్కులును, మూఁడవయష్టకమువందు వందఋక్కులును నాల్గవదానియందు ౧౭౫౫ ఋక్కులు, ఐదవదానియందు ౧౨౩౫ ఋక్కులు నాఱవదానియందు ౩౦౦ ఋక్కులు, నేడవదానియందు ౨౦ ఋక్కులు నెనిమిదవదానియందు ౫౫ ఋక్కులునుగలవు. వేదమందలి యనేకాధ్యాయము లీ కాలమునఁ జిక్కవనియు లోపించిపోయినవనియుఁ జరణవ్యూహ మభిప్రాయపడినది. మహాభాష్యము ననుసరించి ౨౧ శాఖలు ఋగ్వేదమునకుఁ గలవు. అయితే ౨౧ శాఖలమాట యట్లుండనిండు. ఇప్పుడైదు (౫) శాఖలుగూడఁ జిక్కవు. ప్రస్తుతకాలమునఁ గేవలము "శాకల" శాఖమాత్రమే ప్రచారములోనున్నదని యనేకులు విశ్వసించుచున్నారు. "వాస్కల" శాఖకు ౧౦౬౨౨ కవితా సంఖ్యయు, "శాఖల" శాఖకు ౧౫౩౮౧ కవితాసంఖ్యయు గలదు. ఈగణనమందుఁగూడ మతభేద మున్నది. భారతీయుల

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

దురదృష్టమువలన, వేదము చాలవఱ్ఱకు లోపించుటయే యిట్టిమతభేదములకుఁ బ్రధానకారణమై యున్నది. ఋగ్వేదములోని బ్రాహ్మణము రెండువిధములుగా నున్నది. 1 ఐతరేయము. 2 కౌషీతకి (సాంఖ్యాయన) యని ఐతరేయబ్రాహ్మణ మెనిమిదిపఞ్జికలుగా విభాగింపఁబడినది. ఒక్కొక్కపఞ్జిక ౫ అధ్యాయములుగా, నొక్కొక్కయధ్యాయ మనేకకాండములుగా విభజింపఁబడినది. ఋగ్వేదములోని యారణ్యకమునకు "ఐతరేయారణ్యక" మనిపేరు. దీనియందు ౫ యారణ్యకములును, ౧౮ అధ్యాయను లునున్నవి.

యజుర్వేదము, ముఖ్యముగా రెండుభాగములందు విభక్తమైనది. శుక్లము, కృష్ణములని. కృష్ణయజుర్వేదసంహితకు "తైత్తిరీయసంహిత" యని మారుపేరుగలదు. చరణవ్యూహమతానుసారముగాఁ గృష్ణయజుర్వేదమునకు ౮౬ శాఖలు గలవు. మహాభాష్యమతానుసారముగా యజుస్సునకు ౧౦౧ శాఖలును, ముక్తికోపనిషన్మతానుసారముగా ౧౦౯ శాఖలున్నవి. కాని యిప్పుడు యజుర్వేదమునకుఁ గేవలము ౧౨ శాఖలయు, ౧౪ ఉపశాఖలయు నామములుమాత్రమే లభించుచున్నవి. చరక, ఆహరక, కఠ, ప్రాచ్యకఠ, కపిష్ఠలకఠ, ఔపమన్య, అష్ఠలకఠ, చారాయణీయ, వారాయణీయ, వార్తాంతవేయ, శ్వేతాశ్వతర, మైత్రాయణీయములని యీశాఖలనామములు. తైత్తి

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

రీయశాఖకు రెండుపశాఖలుగలవు. ఔఖ్యము, ఖాండికేయము, అని. ఖాండికేయమను నుపశాఖకైదుప్రశాఖలున్నవి,అపస్తంబీ, బౌధాయనీ, సత్యాషాఢీ, హిరణ్యకేశీ, ఔధేయము లని. మైత్రాయణీయశాఖ కేడు ఉపశాఖలుగలవు. మానవ, దుందుభ చైకేప, వారాహ, ద్రవేయ, శ్యామ, శ్యామాయనీయము లని. ఈ ఉపశాఖలు, ప్రశాఖలునన్నియుఁ గలిపినచోఁ బదునాలు గగును. మంత్ర, బ్రాహ్మణాత్మకమగు కృష్ణయజుర్వేదమందుఁ బదునెనిమిది వేలమంత్రములుగలవు. ఇందులోని మంత్రభాగము తైత్తిరీయసంహితయం దేడష్టకములుగానున్నది, ఒక్కొక్క యష్టక మేడేసి యెనిమిదేసి యధ్యాయములుగలదిగానుండును. అధ్యాయములకుఁ బ్రశ్నములనియు, అష్టకములకుఁ బ్రపాఠ ములనియు ననెదరు. ఒక్కొక్కయధ్యాయమునందుఁ బెక్కను వాకములుగలవు. ఈ గ్రంథమునందలి యనువాకముల మొత్తము ౭౦౦. దీనికిఁ బ్రజాపతి, సోముఁడు మున్నగుదేవతలు ఋషులైయున్నారు. దీనియం దశ్వమేధము, అగ్నిష్టోమము, జ్యోతిష్టోమము, రాజసూయము, అతిరాత్రము, మున్నగు క్రతువులవర్ణనమున్నది. కృష్ణయజుర్వేదమునందలి బ్రాహ్మణ మునకుఁ దైత్తిరీయబ్రాహ్మణమనియు నారణ్యకమునకుఁ దైత్తి రీయారణ్యకమనియుఁ బేళ్లు జ్ఞానకాండమందుఁ దైత్తిరీయోప నిషత్తుగాక శాఖలననుసరించి మైత్రాయణీయశాఖకు మైత్రా

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

యణీయోపనిషత్తు, కఠశాఖకుఁ గఠోపనిషత్తు, శ్వేతాశ్వతరో పనిషత్తు, నారాయణోపనిషత్తు మొదలగునవి చిక్కుచున్నవి.

శుక్లయజుర్వేదమునకు "వాజసనేయసంహిత" యని మఱియొక పేరుగలదు. దీనికి ఋషి యాజ్ఞవల్క్యుఁడు. దీని యందుఁ బందొమ్మిదివందలు (౧౯౦౦)ను, దీని బ్రాహ్మణ భాగమం దేడువేలయాఱువందలు (౭౬౦౦) మంత్రములును గలవు. శుక్లయజుర్వేదమునకుఁ బదునేడు (౧౭) శాఖలున్నవి. జాబాల, బౌధేయ, కణ్వ, మాధ్యందిన, జ్ఞాపేయ, తాపాయ నీయ, కాపాల, పౌండ్రవత్స, ఆవటిక, పామావటిక, పారా శరీయ, వైధేయ, వైనేయ, ఓధేయ, గాలవ, వైజవ, కాత్యా యనీయములని వానినామములు. వాజసనేయసంహిత,నలుఁబది యం యధ్యాయములుగా రెండువందలతొంబది (౨౯౦) అను వాకములుగా మఱియు ననేకకాండములుగా విభజింపఁబడినది. దర్శపౌర్ణమాస, అగ్నిష్టోమ, వాజపేయ, అగ్నిహోత్ర, చాతు ర్మాస్య, షోడశీ, అశ్వమేధ, పురుమేధము మున్నగుయజ్ఞముల వర్ణనమిం దున్నది. దీనియందు వైదికయుగమందలి సాంఘిక రీతినీతులుగూడ నున్నవి. ప్రసిద్ధమైన "శతపథబ్రాహ్మణ" మిద్దానిమాధ్యందినశాఖ కంతర్గతమైనది. దీనిరెండుభాగము లలోఁ బదునాల్గుకాండలు గలవు. బృహదారణ్యకోపనిషత్తీ కాండలలో నంతర్గతమై యున్నది. సామవేదమునకు వేయి

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

శాఖలుండినవి. వానినుండి ఆసురాయణీయ, వాసురాయణీయ వార్తాంతవేయ, ప్రాంజల, ఋగ్వర్ణభేదా, ప్రాచీనయోగ్య, జ్ఞానయోగ్య, రాణాయనీయములను నీనామములు మాత్రము లభించును. వానిలోని రాణాయనీయమను భాగమునందుఁ దొమ్మిదిభేదములుగలవు. శాట్యాయనీయ, సాత్వల, మౌద్గల, ఖల్వల, మహాఖల్వల, లాంగల కౌథుమ, గౌతమ, జైమినీయము లని వానినామములు. ఈకాలమునందు సామవేదములోని కౌథుమశాఖమాత్రముచిక్కుచున్నది. సామవేదము రెండుభాగములు 1 పూర్వసామము, 2 ఉత్తరసామము. పూర్వసామమునకాఱు ప్రపాఠకములుగలవు. దీనికి "ఛందోర్చిక" మని మాఱుపేరున్నది. సామవేదీయులగు నుద్గాతలిద్దానినే గానమొనర్చుచుండిరి. సప్త సామమనికూడ దీనికి మఱియొకనామముగలదు. సామవేదము యొక్క యుత్తరభాగమునకు ఉత్తరార్చిక, లేక ఆరణ్యగణ మనిపేరు. సామవేదములోని బ్రాహ్మణభాగమునందు "ఆర్షేయ" దేవతాధ్యాయ, అద్భుత, తాండ్యమహాబ్రాహ్మణ, సామవిధానము మున్నగు నెనిమిది బ్రాహ్మణములుగలవు. ఇందు రెండు పనిషత్తులు ప్రధానములైనవి. ఛాందోగ్యోపనిషత్తు కేనోపనిషత్తు.

చరణవ్యూహగ్రంథమం దథర్వవేదములోని మంత్ర సంఖ్యను గుఱించి యిట్లున్నది.



CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

ద్వాదశానాం సహస్రాణి మంత్రాణాం త్రిశతానిచ

అధర్వవేదమునందు పండ్రెండువేల మూడువందలు (౧౨౩౦౦) మంత్రములున్నవి. కాని ప్రస్తుతకాలమున నింత కంటెం జాలతక్కువగా మంత్రములు లభించుచున్నవి. దీనికి తొమ్మిదిశాఖలుగలవు. పైప్పల, దాంత, ప్రదాంత స్నాత, సౌత్న, బ్రహ్మదావల, శౌనక, దేవీదర్శతీ, చరణవిద్యా యని వానినామధేయములు. తొలుత దీనికి శాఖలనేకములుండెడివి. అయితే ప్రస్తుతకాలమందుం గేవలము శౌనకశాఖ మాత్ర మున్నది. శౌనకశాఖ యిరువది కాండములుగా విభజింపంబడి నది. అథర్వవేదమందు శత్రుపీడనము, ఆత్మరక్ష, ఆపన్నివృత్తి మొదలగు కార్యములనుగుఱించి యనేకమంత్రములు గలవు. వర్తమానకాలమందున్న తంత్రశాస్త్రమంతయు నథర్వవేదము నుండియే జనించినట్లు తెలియుచున్నది. అథర్వవేదములోని బ్రాహ్మణమునకు "గోపథబ్రాహ్మణ"మని పేరు. దీనిజ్ఞానకాం డమునందుం జాలయుపనిషత్తులుండినవి. ఇప్పటికిని జాబాల, కైవల్య, ఆనందవల్లీ, ఆరుణీయ, తేజోబిందు, ధ్యానబిందు, అమృతబిందు, బ్రహ్మబిందు, నాదబిందు, ప్రశ్న, ముండక, అథర్వశిరస, గర్భ, మాండూక్య, నీలరుద్రములోనగు చాల యుపనిషత్తులు దొరకుచున్నవి.

అథర్వవేదమును గూర్చినవారివిషయమై మూడభిప్రా యములుగలవు. అథర్వుడు, అంగిరసుడను ఋషులవంశము

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

నందు జన్మించిన మహామహులచే నిదిగూర్పఁబడినదని కొంద
ఱును, భృగువంశీయులచే నిది సంకలితమైనదని మఱికొందఱును
జెప్పుచున్నారు. ఇంకఁగొంద అధర్వమహర్షిచేతయజ్ఞముజరిగెడి
సమయమం దథర్వవేదము కూర్పబడినదని పలుకుచున్నారు.
ఋక్కు యజుస్సు సామము అథర్వములను నీనాలుగువేదముల
నుండియే విశేషముగా సాధారణసూక్తములుచిక్కును. దీని
వలన నొకదానినుండియే వరుసగా నాలుగు వేదములు విభా
గింపఁబడినవని తెలియుచున్నది. సూతసంహితయందిట్లు చెప్పఁ
బడియున్నది.

స పున ర్దేవదేవస్య ప్రసాదా దంబికాపతేః
సంక్షిప్య సకలా న్వేదాం శ్చతుర్ధా కృపయా ద్విజాః॥
ఋగ్వేదః ప్రథమః ప్రోక్తో యజుర్వేద స్తతః పరః
తృతీయ స్సామవేదాఖ్య శ్చతుర్థోఽథర్వ ఉచ్యతే॥
ఏకవింశతిభేదేన ఋగ్వేదో భేదితో మునా
యజుర్వేదో ద్విజా ఏకశతభేదేన భేదితః॥
నవధా భేదితోఽథర్వవేద స్సామసహస్రధా
వ్యస్త వేదతయా వ్యాస ఇతి లోకే శ్రుతో మునిః॥

వేదవ్యాసమహర్షులవారు దేవదేవుఁడగు నుమామహే
శ్వరునికృపచే యావద్వేదమును నాలుగుభాగములుగా విభా
గించెను. 1 ఋగ్వేదము 2 యజుర్వేదము 3 సామవేదము 4
అథర్వవేదమునైయున్నది. తరువాత నతనిచేతనే ఋగ్వేదము
౨౧ భాగములుగా, యజుర్వేదము ౧౦౧ భాగములుగా అథ

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

ర్వవేదము తొమ్మిదిభాగములుగా సామవేదము ౧౦౦౦ భాగ
ములుగా విభాగింపఁబడినది. ఈ౧౧౩౧ భాగములు వేదమునకు
శాఖలైనవి. వేదములనువిభాగించినందువలననేయామహర్షికి "వేద
వ్యాసులు" అను నామముగలిగినది. ఇట్లువేదమును చతుర్విధము
లుగావిభజించుటకుఁ బ్రయోజనముగూడగలదు. ఎట్లన? యజ్ఞార్థ
మభిప్రవృత్తములగు వేదములలోని ఋగ్వేదమూలమున యజ్ఞ
మునకు సంబంధించిన హోతృప్రయోగమును, యజుస్సద్వా
రమున యజ్ఞీయమగు నధ్వర్యు ప్రయోగమును, సామమూల
మున నుద్గాతృ (దీనిలో బ్రహ్మ, యజమానప్రయోగముగూడ
నంతర్భూతమగును) ప్రయోగమునగును. ఇఁక నథర్వవేదమందు
శాంతిక, పౌష్టికాభిచారకాది యజ్ఞములను ధర్మములను దేవ
తోపాసనా రహస్యములను జ్ఞానమును బోధించుమంత్రములు
నుండుటంబట్టి యొకటిగానుండు వేదమును నాల్గుభాగములుగా
విభాగించుట యెల్లవిధముల యుక్తియుక్తమైయున్నది. ఇదిగాక
శాఖాభేదమునందు మతభేదమున్నది. పాతంజలమహాభాష్యము
సూతసంహితలనుబట్టి వేదమునకు ౧౧౩౧శాఖలును ముక్తికో
పనిషత్తునుబట్టి ౧౧౮౦ శాఖలును, స్కాందపురాణమును బట్టి
౧౧౩౭ శాఖలును, గలవని తెలియఁగలదు. ఇట్లు మతభేదముం
డుటకుఁ దాత్త్వికకారణమంతగా నేమియులేదు. కేవలము
గొందఱుమహర్షులు కొన్నిశాఖల నన్యశాఖలయం దంతర్భూత

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

ములఁజేసి సంఖ్యను దగ్గించిరి. కొంతయునుహర్షు లట్లుశాఖల నితరశాఖలయందుఁ గలుపక సరిగా సంఖ్యయందుంచిరి. అందు వలన వేదశాఖాసంఖ్యయందిట్లు మతభేదమున్నప్పటికిని మహ ర్షులవాక్యములందుఁ పరస్పరవిరుద్ధమేమియులేదని తెలిసికొన వలయును.

భగవతియగు శ్రుతి భవరోగవైద్యమైనందున జీవునకుఁ ద్రివిధశుద్ధి గలుగజేసి ముక్తినొసంగుటకుఁ గర్మోపాసనా జ్ఞాన రూపమగు త్రివిధకాండమునందు విభక్తమైనదనెడి యీమాట మొట్టమొదటనే చెప్పబడినది. తదనుసారముగా మంత్రము, బ్రాహ్మణము, వీనిలో నంతర్గతములైన ఆరణ్యకములు లేక ఉపనిషత్తులనెడి యీమూఁడును వేదమునకు మూఁడుభాగము లైనవి. మఱియు వేదమునందలి యొక్కొక్కభాగమునందుఁ గర్మము, నుపాసనము, జ్ఞానములను నీమూటియొక్క విషయ ములున్నను విశేషించి సంహితాభాగమునందు నుపాసనాకాండ మును బ్రాహ్మణభాగమందుఁ ప్రధానముగాఁగర్మకాండమును నుపనిషద్భాగమునందు ముఖ్యముగా జ్ఞానకాండమునుపదేశింపఁ బడియున్నదనునదియు నీవఱకేచెప్పియున్నాము. ఇందలి యార ణ్యకభాగము లేక యుపనిషద్భాగముయొక్క లక్షణము మొద టనేవచించియున్నాము. ఆరణ్యకములు(ఉపనిషత్తులు)సంహితా బ్రాహ్మణములలో నంతర్భూతములైనందునఁ దఱచుగావేదము నకు మూఁడుభాగములున్నట్లు వర్ణింపక మంత్రము, బ్రాహ్మణ

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

ములను నీ రెండుభాగములే యున్నట్లుచెప్పిరి. ఆపస్తంబమహర్షులవారిట్లువ్రాయుచున్నారు.

మంత్రబ్రాహ్మణయో ర్వేదనామధేయం॥

మన్త్రమునకు, బ్రాహ్మణమునకును వేదమని పేరు. జైమినిమహర్షులవారు మన్త్రము, బ్రాహ్మణములనునీ రెంటికి వేదమని వచించి లక్షణమును వర్ణించియున్నారు. పూర్వమీమాంస, రెండవయధ్యాయములో

"తచ్చోదకేషుమంత్రాఖ్యా శ్శేషే బ్రాహ్మణశబ్దః"

అని సూత్రించియున్నారు. చోదనా (ప్రేరణాలక్షణ) శ్రుతియే మంత్రము. మంత్రముకాక మిగిలిన వేదభాగము బ్రాహ్మణము. అభిధానముయొక్క ప్రేరక విషయముసం చెచట నుపదేశము చేయఁబడుచున్నదో యచట "మంత్రానధీమహే" మంత్రములను జదివెదము. "మంత్రానధ్యాపయామః" మంత్రములను జదివించెదము. అనుమున్నగునవి చోదనాలక్షణ శ్రుతి మంత్రములున్నవి. దీనినే నిష్కర్షించి యిట్లుచెప్పుచున్నారు.

యాజ్ఞికానాం సమాఖ్యాతం లక్షణం దోషవర్జితం
తేఽనుష్ఠానస్మారకాదౌ, మంత్రశబ్దం ప్రయుంజతే.

ఏ యే శ్రుతులయందు యాజ్ఞికుల సమాఖ్యాతత్వము ననుష్ఠానస్మారకత్వమును, స్తుతిరూపత్వము, ఆమంత్రణోపేతత్వము లోనగు భావములు చెలఁగుచున్నవో యవి మంత్రములని గ్రహింపవలసినది. దీనికంటె నితరమగు శ్రుతి బ్రాహ్మణమని

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

తెలిసికొనవలయును. సాధారణముగా నేశ్రుతులు: యజ్ఞీయా
నుష్ఠానసమర్థములతోఁ బాఁటేదో యొకదేవతపై లక్షితములై
యున్నవో వాని నన్నిఁటిని మంత్రములని వచింపవచ్చును. ఇఁక
నే శ్రుతులయందే మంత్ర మే కార్యమం దుపయోగింపవలెనో
దాని నుల్లేఖించి మంత్రమునకు విశేషవ్యాఖ్య గావింపఁ బడు
చున్నదో దానికి బ్రాహ్మణమని చెప్పెదరు. బ్రాహ్మణభాగము
గూడ విధిరూపము, అర్థవాదరూపము, తదుభయ విలక్షణ
రూపము లను భేదములచే మూఁడు ప్రకారములుగా నున్నది.
వీనియందుఁ బ్రభాకరునిచే శబ్దభావనయు, లింగాది ప్రయోగము
గలది విధిలక్షణమని చెప్పంబడెను. అనఁగా నెందు శబ్దములను
భావించుటయు, లింగము మున్నగువానిని బ్రయోగించుటయు
నుండునో యది విధిరూపమని తెలియవలెను. "ఇష్టసాధనతా
విధిః" ఇష్టమును సాధించుట విధియని తార్కికులు మున్నగు
వారు వచించిరి. ఎల్లవిధులుగూడ, ఉత్పత్తి, అధికార, వినియోగ
ప్రయోగములను భేదములచే నాలుగు ప్రకారములగుచున్నవి.
స్తుతినిందాశూన్యమును, విధికవశిష్టమైనదియునగు వాక్యసమూ
హ మర్థవాదరూపము. ఈ యర్థవాదముగూడ, గుణవాదము,
అనువాదము, భూతార్థవాదము లనుభేదములచే మూఁడు రీతు
లుగా నున్నది. విధిరూ పార్థవాదరూపములకు వేఱయినవి
వేదాంతవాక్యములు. ఇవ్వి దెలియనివిషయములను దెలియఁ

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

జేసినప్పటికి ననుష్ఠానమును జెప్పనందునలన విధిరూపములుగానే రవు. మఱియు సర్వవిధులు నంతఃకరణ శుద్ధియూలనుున దాని యుండే సమాప్తియగుటంబట్టి "అన్య శేషత్వాభావాత్" అనఁగా నర్థవాదముగూడఁ గానేరదు. అందుచే ఉభయ విలక్షణ మగు చున్నది.

— { బ్రాహ్మణభాగము స్వతఃప్రమాణమా? పరతఃప్రమాణమా? } —

ఇటీవలివారగు కొందఱు వేదములోని బ్రాహ్మణభాగము పరతఃప్రమాణమనియు, నందుచే నది స్వతఃప్రమాణమగు సంహితా (మాత్ర) భాగముకంటె వేఱయినదనియుఁ దక్కువ మైనదనియు వచించి వైదికలోకమం దధికముగాఁ గోలాహలము బుట్టించియున్నారు. వేదమనఁగానేమి? వేదము యొక్క వేదత్వమేమి వేదపూర్ణత్వము, పూర్ణుండగు భగవా నుని నిశ్వాసములేక వాక్యరూపత్వము, నపౌరుషేయత్వము,సకల జీవకల్యాణ కారిత్వము ననునివి యేయే భావములపై నిర్భర మై యున్నవో యీ విషయముల నన్నిఁటిని నిష్పక్షముగను నుదారభావముతోడను విచారించియుండినచో వార లిట్టి పొర పాటులఁబడకుందురు. తొలుతవిచారణీయా శమేమన,౧౧౧౩౧ లేక ౧౧౮౦ వేదశాఖలనుండి ౪ శాఖలమాత్రమేరుకొని యీ నాలుగింటినే సంహిత అనఁగా స్వతఃప్రమాణమగు వేదముని

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

చెప్పి మిగిలినవాని నన్నిఁటిని బరతః ప్రమాణములగు శాఖల రూపమని యాధునికమతావలంబులు కొందఱుపలుకుచున్నట్లు గాఁ దెలియుచున్నది. ఇదియంతయు భ్రాంతిమూలకము. వేద మనునది వేఱు. శాఖలనునవి వేఱనుమాట లేదు. ఇదిగాక శాఖలు పరతః ప్రమాణము లయినయెడల వారేరుకొనిన పై నాలుగుగూడ శాఖలేకదా. ఈ నాలుగుశాఖలు స్వతః ప్రమాణము లెట్లు కాఁగలవు? సకలశాఖలు స్వతః ప్రమాణములైనఁ గావలె. లేదా పరతః ప్రమాణములైనను గావలె. ఒకశాఖను బరతః ప్రమాణమని, మఱియొకశాఖను స్వతః ప్రమాణ మని చెప్పుట యసత్యముగాకమానదు. యథార్థమునకు ౧౧౩౦ శాఖలయొక్క యావత్సంహితా, బ్రాహ్మణోప నిషద్భాగము లన్నియు వేదము. ఇందు సంశయింపఁ బనిలేదు అనంతమగు వేదము, కల్పముయొక్క ప్రథమదశలో నొక మూర్తిగా విరాజిల్లెను. దానినేకదా శ్రీవేదవ్యాసులవారు నాలుగు భాగములుగా విభాగించినది. మంత్ర, బ్రాహ్మణ, రూపకముగాను, నాలుగువిధములుగాను విభజింపఁబడిన యీవేదమే తిరిగియనేక శాఖలయందు విభాగింపఁబడినది. ఇందులకుఁ బ్రమాణ మితః పూర్వమే యొసంగఁ బడినది. ఇదియే శాస్త్రానుమోదితమైనది. మఱియొకటి యేదియు శాస్త్రసమ్మతము గానేరదు. ఎందుల



CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

కాదురా? ఈకాలమున ఋగ్వేదసంహిత, యజుస్సంహిత, సామ
సంహిత, అథర్వసంహితయను పేరులతో నేవి ప్రచారములో
నున్నవో యవి యన్నియుఁ గలిపి ౧౧౩౧, లేక ౧౧౮౦ వేద
శాఖలగును. ఏశాఖయైనను పైదానిలో నేదో యొకదానికిఁ
జెందియుండుననునది ప్రత్యక్షసిద్ధమైనది. సామవేదసంహిత,
కౌథుమీశాఖయనియు, నథర్వవేదసంహిత, శౌనకశాఖయని
యు, యజుర్వేదసంహిత, తైత్తిరీయశాఖయనియు, మాధ్యందిన
శాఖ మొదలగునవి యన్నియుఁ బైశాఖలలోఁ జేరినవనియు నీ
వఱకే చెప్పఁబడినది. అందువలన మంత్రము, బ్రాహ్మణములను
పేళ్లతోనున్న వేదము ౧౧౩౧ లేక ౧౧౮౦ శాఖలు గలది
యని తేలును. వీనిలోఁ గొన్ని శాఖాసంహితలు చిక్కుచున్నవి.
అనేకశాఖలు లోపించినవి. అన్ని శాఖలు, నపౌరుషేయములు,
భగవద్వాక్యములు, స్వతఃప్రమాణములు నైయున్నవి. వేద మనం
తము, వేదరత్నాకరముయొక్క గాంభీర్యమును నిర్ణయించుట
యెవనికి శక్యమగును? అట్లయినప్పటికి శక్తి కొలఁది విచారించి
నంతవఱ కెప్పుడు వేదము మంత్రబ్రాహ్మణాత్మకమైనదో యప్పుడే
యొక్కొక్క శాఖామాత్రముతోఁ బాటు నొక్కొక్క బ్రాహ్మ
ణముగూడఁ దప్పక యుండునని సిద్ధాంతితమగుచున్నది. సంహి
తాభాగమందలి మంత్రము క్రియలయొక్క ప్రణాళికయం దేరీతి
గా వ్యవహరింపవలయునో దానివర్ణన మెప్పుడు బ్రాహ్మణభాగ

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

మంచుండుట సంభవించినదో యప్పుడొక్కొక్క మంత్రముతోం బాటొక్కొక్క క్రియావిధిరూపమైన బ్రాహ్మణముండుట సహజ సిద్ధమైనది. కర్మము, నుపాసనము, జ్ఞానము వేదమునకుం బునాదిగోడలు. ఇవి లేనిచో వేదమునకు వేదత్వము, బూర్ణ త్వమును, ముక్తి ప్రదాతృత్వశక్తియు నుండనేరవు. అప్పుడీ యంశము విచారింపవలసియుండును. ఏమనంగా ఏ విషయమున నాధిభౌతికాధి దైవికముల సార్థకత యున్నదో దాని యాధ్యా త్మిక సార్థకత యెప్పుడుగూడ ఖండింపం బడంజాలదు. ఇందు వలన నేమంత్రములోం గర్మశక్తి, యుపాసనాభావ మున్నదో దానియందుజ్ఞానశక్తిగూడ నవశ్యముండును. ఈకారణమువలనం బ్రత్యేకశాఖకు మంత్రము,బ్రాహ్మణములతోంగూడ దదంతర్గత మైన యారణ్యకములు (ఉపనిషత్తులు) గూడ నవశ్యమైయుం డును. ముక్తికోపనిషత్తులో నీరీతిగాం జెప్పంబడినది.

"ఏకైకస్యాస్తు శాఖాయా ఏకైకోపనిషణ్మతా"

ఒక్కొక్క శాఖకు నొక్కొక్క యుపనిషత్తుగలదు. ఈ కల్పమందుం బ్రకాశపరుపంబడిన ప్రాంబలుకులలోని చాల యంశములు లోపించిపోవుట భారతీయుల దురదృష్టమై యున్నది. ఇందుల కుపబలముగా మన ప్రబుద్ధులు కొంద ఱా వేదమందలి రహస్యములను దెలిసికొనంజాలక దాని సంగహీను రాలినిగాం జేయు పాపమునకు లోనగుచున్నారు. కాంబట్టి

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

యార్యావర్తమందుఁ బుట్టిన ప్రతిమనుష్యుఁడును పైవిషయ ములనెల్లఁ బట్టుదలతో విచారించి ముందైనను జాగ్రత్త పడ వలసియున్నది.

పాపము! బ్రాహ్మణభాగ మేమపరాధము జేసినది? ఎందుచేత నది భగవద్వాక్యము గాదనియుఁ బరతఃప్రమాణ మనియుఁ జెప్పఁబడుచున్నది. బ్రాహ్మణము, మంత్రభాగమం దలివిషయముల క్రియావిధులను దెలియఁబఱచునదియో తద్వ్యా ఖ్యానమో, దాని టీకయో యైనప్పు డది వేదమని చెప్పుటకు సందేహ మేమి? మంత్రభాగమీశ్వరుని మొగమునుండి బయలు దేరినదియో యతని నిశ్వాసముల మూలమునఁ బ్రవహించి నదియో యైనప్పుడు దాని క్రియావిధి (బ్రాహ్మణభాగము) గూడ నట్లు బయలుదేరుటగాని ప్రవహించుటగాని యొదులకు సంభవింపఁగూడదు? ఇట్లు వ్యర్థముగా లేనిపోని సంశయము లను లేవఁదీసి భగవతియగు శ్రుతిని నంగహీనురాలిని గాఁ జేయుట కేవలము పక్షపాతముతో నిండిన కపోలకల్పనామాత్ర మైయున్నది. ఇట్టి తుచ్ఛమైన యుక్తులయందు యథార్థస్థితి యొంతమాత్రమును లేదు. కారణ మేమందురా? బ్రాహ్మణ భాగము వేదమా? కాదా? యను విషయమును నిశ్చయించు కొనుట కేరెండో నాలుగో పన్నుగడలు పన్నినంతమాత్రమున గాని, తమపక్షమున కనుకూలించునట్లు పెడయర్థములఁ జేసి

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

యేహో నాలుగు ప్రమాణములను జూపినంతమాత్రముననఁ గాని యిష్టసిద్ధిఁ గానేరదు. ఇంను వేదమునకు వేదత్వమెట్టిది? వేద లక్షణమేమి? ఏ యే విషయములున్నందున నది వేద మనుశబ్ద ముచేఁ జెప్పఁదగిన దైనది? ఏయే విషయములు లేనందున వేద మున కపూర్ణత్వము సంభవింపఁ గలదు? ఇట్టి సంగతులన్ని యు బ్రాహ్మణభాగమును వేదములోనుండి దీసివేయుటకు ముందుగా విచారింపవలసియున్నది. స్మృతి చెప్పినట్లు ప్రత్యక్ష ప్రమాణముచేఁ గాని యనుమాన ప్రమాణముచేఁ గాని దొరక నట్టి వస్తువు వేదముచేతఁ జిక్కుచున్నది. ఇదియే వేదమునకు వేదత్వమని యిందాదియందే యుగ్గడింపఁ బడినది. ఇప్పుడు నిష్పక్షముగా విచారించినమీఁద, లౌకిక ప్రత్యక్షాను మాన ములకు మించినట్టి యే యాధ్యాత్మిక బ్రహ్మపద ప్రాప్తిగలదో దానికి బ్రాహ్మణభాగముయొక్క తోడ్పాటే యధికముగాఁ గైకొనవలసియున్నదని యందఱికిఁ దెలియఁ గలదు. ఏమన, బ్రహ్మతత్త్వమును సమగ్రముగా నిరూపించెడి యుపనిషత్తులు బ్రాహ్మణభాగమునం దంతర్గతములై యుండుటయే. ఇందు సందియమొందుట నిరర్థకము. కర్మము, ఉపాసనము, జ్ఞానము లను నీ మూఁడింటి పూర్ణతయుండుటవలన వేదమునకుఁ బూర్ణత్వము, నపౌరుషేయత్వమున్నది. ఏమన, ఎప్పుడెద్దాని యందు జీవుని బ్రహ్మభావమును బొందించు శక్తియుండునో

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

యప్పుడే యావేదము పూర్ణుండైన భగవంతునివాక్యము గాఁ గలదు. ఎప్పుడు సద్భావ చిద్భావానంద భావములు పూర్ణ ముగా లభింపఁబడునో యప్పుడే బ్రహ్మభావప్రాప్తియగుచు న్నది. కర్మమూలమున సద్భావమును, నుపాసనమువలన, నా నందభావమును,జ్ఞానమునజిద్భావమునుగలుగగలదు. అందువలన వేదమునకుమూఁడుకాండములున్నవి.(1)మంత్రభాగమైనయుపా సనాకాండము 2బ్రాహ్మణభాగమైన కర్మకాండము. 3ఆరణ్యక (ఉపనిషత్) భాగమైన జ్ఞానకాండము. ఇందువలన వేదమునకు బ్రాహ్మణభాగమును దానిలోఁజేరిన యారణ్యకములు (ఉప నిషత్తులును) లేకుండనున్నచో తదపౌరుషేయత్వమును తత్పూ ర్ణత్వమును సర్వవిధముల ఖండింపఁబడగలదు. "భాగ" మను పదము పలుకుటచేతనే కేవలము మంత్రమే వేదముగాదను విషయము తేలుచున్నది. ఎందులకందురా? "భాగ" శబ్దము భాగాంతరమును సూచించుచున్నది. కేవలమొకమంత్రమే వేద మయినయెడల "మంత్రభాగ" మని చెప్పబడక మంత్రమని మాత్రము చెప్పఁబడును. ఇట్లు చెప్పఁబడినప్పుడు దీనివలన మంత్రభాగమేకాక వేదమునకు బ్రాహ్మణము, తదంతర్భూత ములగు నారణ్యకములు (నుపనిషత్తు)లనెడి భాగములుగూడ నున్నవనియు, నివన్నియుఁ గలియుటచేతనే యెల్లభాగములతో గూడిన సంపూర్ణుండగు వేదమూర్తి నయనగోచరుండై సాధకు

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

లకు శ్రేయస నిశ్శ్రేయసములను గల్గించుటయందు సర్వథా సర్వదా సమర్థతతో సంసిద్ధములై యున్నాఁడనియు నిశ్చయమగుచున్నది. మఱియు మంత్రము, బ్రాహ్మణము, నారణ్యకములందు ప్రధానముగా నుపాసనా, కర్మ, జ్ఞానవర్ణనములున్నను సాధారణముగా నొక్కొక భాగమందుఁగూడ మూఁడింటివర్ణనముండును. ఎందులకన, పూర్ణమగు వస్తువునకుఁ బ్రత్యేకాంగమందుఁగూడఁ బూర్ణత్వము ప్రకాశించుచుండునుగదాయని యీనలఱకే చెప్పఁబడినది. ఇట్లువిచారించినమీఁదఁగూడఁగర్మము నుపాసనము జ్ఞానముల పూర్ణత యేకాధారమందుఁ బ్రాహ్మణ భాగములోఁ జిక్కినంత సంహితా (మంత్ర) భాగమునందుఁ జిక్కనేరదు. ఎందులకన, జ్ఞానపూర్ణత్వము బ్రాహ్మణభాగాంతర్గతములగు నుపనిషత్తులందే యుండుటంబట్టి. ఆప్రకారమే స్పష్టములుగాని కర్మోపాసనా మంత్రములు స్పష్టముగా నా బ్రాహ్మణభాగమందు విశదీకరింపఁబడియున్నవి. అందువలన దీనియందుఁ బూర్ణతయొక్కయు, జీవకల్యాణకారితయొక్కయు లక్షణమధికముగానున్నది. దీనింబట్టి యిట్టి విస్తారముండుటయు విశేషమగు వివరణముండుటయు బ్రాహ్మణభాగమునకు భూషణమేకాని దూషణముగాఁజాలదు. అందువలన నిది పరతః ప్రమాణమనియనుట పొరపాటు. ఇదిగాక గుణ, భావ, విషయములందుఁగూడఁ జక్కగా నాలోచించినచో బ్రాహ్మణ

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

భాగ మహాపురుషేయ మగుట కే సంశయమును గలుగనేరదు. గుణ, భావ, విషయములంగూర్చి యీవఱకే యెక్కువగాం జెప్పంబడినందునందిరిగి యిప్పుడుచెప్పుట నిష్ప్రయోజనమగును. త్రిగుణములయొక్కయు ద్విభావములయొక్కయు నెట్టి పూర్ణత యుండుటచేత వేదము భగవద్వాక్యమని చెప్పంబడినదో యా లక్షణమంతయు బ్రాహ్మణభాగమునందు విరాజిల్లుచున్నది. బ్రాహ్మణమునందు సాత్త్విక, రాజసిక, తామసికులగునధికారుల యభివృద్ధి కొఱకు మూండువిధములుగా యజ్ఞవిధి నూపంబడినది. బ్రాహ్మణభాగమునందలి యొక్కొక్క శ్రుతిలో మూండేసి మూండేసిభావములు నిండియున్నవి. ఇయ్యది పరిశోధకులగు పండితులు దెలిసికొనంగలరు. ఈ సంగతులనన్నింటినివిచారణయందు బెట్టికొని యే భాగముస్వతః ప్రమాణము? ఏభాగముగాదు? అని విమర్శించుకొనవలయును. కేవలము ప్రమాణములనిచెప్పి యే నాలుగుశ్లోకములో యేసూత్రమో చూపి వానికిం దప్పుడర్థములం జెప్పి సమన్వయించినంతమాత్రమున దత్త్వనిర్ణయముగాదు. కాని పాండిత్యప్రౌఢిమ మాత్రమే కాంగలదు. శబ్దముపై శాస్త్రార్థముచేయుట యొకటి, జ్ఞానరాజ్యమునందును భావరాజ్యమునందును బ్రవేశించుట మఱియొకటి. ఈరెంటికి సంబంధము లేదు. వేదము శబ్దరాజ్యమునందలి వస్తువుగాదు. కాని జ్ఞాన, భావ, రాజ్యములందలి వస్తువులై

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

యున్నవి. అందువలనఁ దత్త్వము ననుసంధించెడి నరుఁడీ విషయములపై ధ్యానముంచి విచారించినయెడల బ్రాహ్మణభాగ మెల్ల తెలుంగులను స్వతఃప్రమాణమని యవశ్యముగ్రహింపఁగలఁడు. ఈ విషయములన్నియు నిట్లుండుటంబట్టియే జైమినిమహర్షుల వారు తమ మీమాంసాదర్శనమందు మంత్రము, బ్రాహ్మణములను రెంటిని వేదమని వచించుచు బ్రాహ్మణభాగమునకు ప్రాధాన్యము నిర్దేశించియున్నారు.

"ఆమ్నాయస్య క్రియార్థత్వా దానర్థక్య మతదర్థానాం
తస్మాదనిత్యముచ్యతే"

(మీమాంసాదర్శనము అ 1 సూ 1)

ఈ సూత్రమునందు వారిచే క్రియార్థకశ్రుతి (బ్రాహ్మణభాగమున) కే వేదమని చెప్పఁబడి యే శ్రుతి క్రియార్థకము గాదో దానికి వృథాత్వమును బ్రతిపాదింపఁబడి యున్నది. ఈ ప్రకార మామహర్షి పూర్వపక్షమునందు బ్రాహ్మణభాగమునకు శ్రేష్ఠతను బ్రతిపాదించి తరువాత నుత్తరపక్షములో మంత్రి భాగమునకుఁగూడ వేదమని చెప్పి రెంటినిగూడ సమర్థించు కొనుచున్నాఁడు.

"విధినాత్వేకవాక్యత్వాత్ స్తుత్యర్థేనవిధీనాంస్యుః"

[మీమాంస, అ ౧, పా ౨, సూ ౭.]

మంత్రభాగము క్రియకు సంబంధించినది గాకపోయినను విధి



CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

యుద్దేశ్యమునుబట్టి యొక కేవిధ మగుటచేత స్వతఃప్రమాణమగు టకుఁ దగినదిగా నున్నది, ఎందులకన, మంత్రభాగము స్తుతి మూలకము. స్తుతిమూలమున విధివిషయములోఁ బ్రరోచన యగుచున్నది. స్తుతిమూలకములగు మంత్రములు క్రియలను బ్రేరేపించి యనుష్ఠించువారల కుపకారము గల్గించుచున్నది. ఈ కారణముచే మంత్రముగూడ వేదమునందుఁ బ్రమాణమైనది. ఇట్లు జైమినిమహర్షులవారు బ్రాహ్మణము, మంత్రములను రెంటికినిగూడ వేదమని చెప్పి బ్రాహ్మణభాగమునకుఁ బ్రాధాన్య మిచ్చియున్నారు.

రెండవది:— కేవలము శబ్దప్రమాణముపై నాధారపడి నప్పటికిని బ్రాహ్మణభాగమునకుఁ బరతఃప్రమాణము సిద్ధిం పదు. కారణ మేమందురా? అనేక ప్రమాణగ్రంథములందుఁ గూడ నిది యపౌరుషేయ వేదాంతర్గతమని, చెప్పఁబడియున్నది. అందువలన దీనికి స్వతఃప్రమాణత్వము వచింపఁబడినది.

"శ్రుతిర్విధేయస్తర్కశ్చ వేదః"

[పారస్కరగృహ్యసూత్రము]

ఈసూత్రము విధి, నిషేధాత్మకశ్రుతిని స్పష్టశబ్దముతో వేదమని చెప్పినది. బ్రాహ్మణభాగము విధినిషేధాత్మకమైనది. కారణమేమన, దీనియందు జ్యోతిష్టోమము, గర్భాధానాదివిధుల వర్ణనముండుటయే మంత్రభాగము విధేయము. ఆ కారణము

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

వలనఁ బారస్కరమహర్షి మతానుసారము రెండును (మంత్ర బ్రాహ్మణములు) వేదాంతర్భూతములని తెలియుచున్నది. ఇట్లే మనుభగవానులవారు గూడ ద్వితీయాధ్యాయములో నిట్లు చెప్పుచున్నారు,

"శ్రుతిద్వైధంతు యత్రస్యా త్తత్రధర్మౌ వుభౌస్మృతౌ
ఉభావపిహితౌధర్మౌ సమ్యగుక్తౌమనీషిభిః.
ఉదితేనుదితేచైవ సమయాధ్యుషితేతథా
సర్వధా వర్తతేయజ్ఞ ఇతీయం వైదికీశ్రుతిః"

ఎచ్చటెచ్చట రెండుశ్రుతులు పరస్పర విరుద్ధములుగా నున్నవో యచ్చటచ్చట నారెంటివలనఁగూడ గలిగెడిధర్మము లాచరణీయములని పెద్దలు సెలవిచ్చిరి. దీనికి దృష్టాంతముగూడ మనువు సూపుచున్నాఁడు. వేదములో సూర్యోదయకాలము నందు హోమము చేయవలసినదని యొక వచనమును, సూర్యో దయము కాకమున్నే హోమము చేయవలసినదని మఱియొక వచనమును, మఱియు, సూర్యుఁడుగాని, నక్షత్రములుగాని లేని కాలమందుఁగూడ హోమము గావింపవలసినదని యింకొకవచ నమును గనుపడుచున్నవి. ఈ ప్రకారముగా శ్రుతివచనములు పరస్పర విరుద్ధములుగా నున్నప్పటికిఁగూడ నధికారభేదమునను సరించి యన్నియు మాననీయములే. ఇదియే మను భగవానుని తాత్పర్యము. మను విందుదయకాల హోమము ననుదితకాలహోమము, మున్నగువాని యాజ్ఞికు శ్రుతి చెప్పి

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

యున్నాడు. ఈ యాజ్ఞలన్నియు బ్రాహ్మణభాగములోనివి. కాబట్టి బ్రాహ్మణభాగముగూడ స్వతఃప్రమాణమగు వేదములో నంతర్గతమైనదని తెలియుచున్నది. ఇట్లుమనసిద్ధాంతము గూడ బ్రమాణితమైనది.

అర్వాచీనులగు వారి రెండవయుక్తి యేమనఁగా:- బ్రాహ్మణ భాగమందు బహుప్రకారములుగా ఋషులు, మునులు రాజులు, మున్నగువారి యితిహాసములును, పురాణ గ్రంథములలోని కథలును వ్రాయబడియున్నవి. ఇందువలన బ్రాహ్మణభాగము వేదము గానేరదు. ఏలయన:- ఇతిహాస మెవనిదైయుండునో వాఁడు పుట్టినతరువాత నది వ్రాయఁబడును. గాని వాఁడు పుట్టకముందు వ్రాయవీలులేదుగదా. మఱియుబ్రాహ్మణభాగమేయితిహాసపురాణము, గాథయనియు దీనికంటెఁ బ్రత్యేకముగా నితిహాసముగాని పురాణము మున్నగు నవిగాని లేవని యర్వాచీనులు సిద్ధాంతీకరించుచున్నారు. ఈ యుక్తి యన్నివిధముల నయుక్తముగానున్నది. తొల్తొల్తఁ బురాణము వేదముకంటె భిన్నమగువస్తువుగాదని తెలిసికొనవలసియున్నది. యితిహాసచరిత్రాదులేవి వేదమునందుఁగలవోవానినే కదా పురాణములందు సులభముగా విశదమగునట్లు వివిధ విషయములుగాఁ జెప్పియున్నారు. చూడుఁడు! శతపథ బ్రాహ్మణమునందు జలప్లావనేతిహాసము నవతారములకథయు, నైతరేయ

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

బ్రాహ్మణమునందు దేవాసుర సంగ్రామకథ హరిశ్చంద్ర చరిత్రమును గలవు. ఈ విషయములన్నియుఁ బురాణములందు వర్ణింపఁబడినవి. వీనిలోని కొన్ని కొన్ని గాథలందుఁ బరస్పరవిరోధములున్నట్లు కనుపడుచున్నవి, ఈ విరోధములు తాత్త్వికములు గావు. కాని భావముల భిన్నత ననుసరించియున్నవి. పురాణముల రచన, భావములకుఁ దగినట్లుండును. వానిరహస్యములను ముందుఁ దెలుపఁగలము. దీనింబట్టి బ్రాహ్మణభాగమునే పురాణముగా నాదరించి పదునెనిమిది పురాణము లూడఁబీకివేయు బుద్ధి భ్రాంతిమయమని తేలును. సందియమిందు లేదు. రెండవ విషయము, ఇతిహాసములయొక్కయుఁ బురాణములయొక్కయు సంబంధముండుటంబట్టియే బ్రాహ్మణభాగము పరతఃప్రమాణము గాగలదని వారు సిద్ధాంతీకరించుచున్నారు. ఈసిద్ధాంతమన్నిటన్నుల నసత్యము. చూడుఁడు. వాజసనేయీ బ్రాహ్మణోపనిషత్తులో.

> అస్యమహతో౽భూతస్య నిశ్వసిత మేత దృగ్వేదో
>
> యజుర్వేద స్సామవేదో౽థర్వాంగిరస ఇతిహాసః పురాణం॥

అనియున్నది. దీనింబట్టి ఋక్కు మున్నగు చతుర్వేదములు నితిహాసము, బురాణము, మున్నగునవియన్నియు భగవంతుని నిశ్వాసరూపమని సిద్ధాంతమైనది. ముందు ఋక్కు మున్నగు నాలుగువేదములు, మంత్రబ్రాహ్మణాత్మకములను

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

నదియు ౧౧౮౦ శాఖలుగలవనునదియు సత్యమైయున్నదిగదా. ఎందులకన, దీని నిందలకు భిన్నముగా సిద్ధాంతీకరించుటకు వేఱు ప్రమాణమేదియులేదు. రెండవయంశము:- ఋగాది చతుర్వేదములను కేవలసంహితగను, ఇతిహాస పురాణములనే బ్రాహ్మణముగను దలంచినప్పుడుగూడ నితిహాసపురాణములు పరతఃప్రమాణములెట్లు కాఁగలవు? ఎందులకన? ఋగ్వేదము యజుర్వేదాదులవలె నితిహాసపురాణములుగూడ భగవంతుని నిశ్వాసమేయైయున్నది. ఇందువలన నొక్కొక్క నిశ్వాసము వలననే బయలుదేరినవేదము స్వతఃప్రమాణముగను, నితిహాస పురాణములు పరతఃప్రమాణములుగ నగుటకుఁ గారణమేమి? భగవంతుని నిశ్వాసమునందిట్టి భేదమెందులకుండవలె? నిశ్వాస శబ్దమునందు రెండు భాగములుంపఁబడియున్నవి. మొదటి సంగతియేమనగా, నిశ్వాసమువలె స్వాభావికముగా సృష్టికిఁ బూర్వమందు వేదము, నితిహాసము, పురాణములెల్ల ఋషుల యుల్లములందు వెల్లివిరిసినవి. దీనిరహస్యము లిందీవఱకుఁ జెప్పఁ బడినవి. ఇక్కారణముననే వేదమునందుఁగూడ గాథలుచిక్కు చున్నవి. దీనివలన సంహిత, బ్రాహ్మణము ఈరెంటినిగూడ స్వతఃప్రమాణములని సిద్ధాంతమయినది. నిశ్వాసశబ్దమునకు రెండవభావమేమనఁగా. ఈశ్వరుని నిశ్వాస మీశ్వరుఁడుండు నంతవఱకు నుండెడిది. కాన సీకీతిగానే నిత్యుండగు భగవంతుని

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

నిశ్వాసరూపమునఁ బ్రకటితములైన వేదము, నితిహాసము, బురాణములుగూడ నిత్యములగుచున్నవి. కేవలము యుగము సందు జన్మించెడి జీవులకర్మమునననుసరించి ప్రకటింపఁబడుచున్నవి. ఈ విషయమునుగూర్చి ధర్మశాస్త్రకారులిట్లు లిఖించుచున్నారు.

యుగాంతేం తర్హితాన్ వేదాన్ సేతిహాసాన్ మహర్షయః
లేభిరేతపసాపూర్వ మనుజ్ఞాతా స్స్వయంభువా॥

సృష్టికిఁబూర్వమునందు బ్రహ్మయాజ్ఞనుగొని మహర్షులు తపస్సుచేత సేతిహాసములును. యుగాంతమందంత ర్హితములైనవియునగు వేదములను బొందిరి. ఇందు సేతిహాసమనగా నితిహాసములతోఁ గూడికొనిన వేదములను బొందిరని చెప్పుటచేత మంత్రము, బ్రాహ్మణమను రెంటికిఁగూడ వేదమనుసంజ్ఞ చెల్లునని స్మృతికర్తలు సమ్మతించినట్లు సిద్ధించుచున్నది. ఈ రీతిగా సేతిహాసవేదములనఁగా మంత్ర, బ్రాహ్మణాత్మకవేదములు సృష్టికిముందు మహర్షులయొక్క సమాధి శుద్ధాంతఃకరణములందుఁ బ్రకటములగును. అందువలన రెండును స్వతఃప్రమాణములే. సందియమేమియు లేదు. విచారించినమీఁద బ్రాహ్మణభాగమునం దేయితిహాసములుచిక్కుచున్నవో వాని వలన బ్రాహ్మణభాగమున కున్న వేదత్వమునకు హాని గలుగ నేరదు, ఇంకను బుష్టిగలుగుచున్నది, ఎందులకనఁగా? ఎప్పుడు వేదముపూర్ణమో, సకలవిధాధికారులకుఁ గల్యాణముగలిగిం

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

చుటయే, యెప్పుడు వేదమునకు వేదత్వమయినదో, యీమనలన
నెందురజోగుణమూలకమగు కర్మకాండము వర్ణింపఁబడినదో,
యందు క్రియాకాండముతో సంబంధము గలిగియున్న యితి
హాసములుండుటగూడ నావశ్యక మగుచున్నది. బ్రాహ్మణ
భాగమునందు వైదికమగు క్రియావిధానముయొక్క యుప
దేశముగలదు. అందువలన దానిలో నితిహాసముల వర్ణనముం
డుటగూడ స్వతస్సిద్ధమైనవిషయము. దీనింబట్టి స్వతఃప్రమా
ణముగానేరదను నెట్టిదోషముగూడ బ్రాహ్మణ భాగమును
దాఁకనేరదు. ఋషులు, మునులు, రాజులు మున్నగువారి
యితిహాసములుండుటవలన బ్రాహ్మణభాగము స్వతఃప్రమా
ణముగాదు. ఏలయన, యెవరియితిహాసములున్నవో యవివారు
పుట్టినతరువాతగదా వ్రాయఁబడునని కొందఱు వాదించుచు
న్నారు. ఈ యుక్తివాదమునకు నెంతమాత్రమును విలువలేదు.
ఎప్పుడు వేదము జ్ఞానస్వరూపమైనదో యప్పుడు భూత,భవిష్య
ద్వర్తమాన కాలములందలి సర్వవస్తువులు దొలుతవర్ణింపఁబడి
యుండుట వేదమునకు వేదత్వమైయున్నది. ఋషులయోగశక్తి,
యందు దపశ్శక్తియందుగూడ భవిష్యత్కాలస్థితి కరతలామల
కమువలెఁ జూడఁజాలెడి ప్రభావమున్నప్పుడిఁక దేశ, కాల
పాత్రాపరిచ్ఛిన్నుండగు మహర్షులకుఁగూడ గురువునగు
భగవంతుని వాణీరూపమగు వేదముచేత నేరెండో యేనాలుగో

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

మహర్షులయు, మునులయు, రాజులయు నితిహాసములు తోలుతనే చెప్పఁబడినందుల కీ ప్రకారము సంశయించుటయుఁ బరతః ప్రమాణత్వమును గల్పించుటయు నెట్లు న్యాయముగాఁగలదు? పతంజలిమహర్షి తన యోగదర్శనము నెట్లువచించుచున్నాఁడో కనుఁడు.

"స ఏవ పూర్వేషామపి గురుః కాలేనానవచ్ఛేదాత్"

ఆ పరమాత్మయే కాలముచేతఁ బరిచ్ఛిన్నుఁడు కాకపోవుటంబట్టి పూర్వులగు వారికందఱకుఁగూడ గురువు. అందుచే నితిహాసము లున్నందునసే బ్రాహ్మణము పరతఃప్రమాణము గానేరదు. ఒకవేళ నిట్లు చెప్పినయెడల మంత్రభాగమునకును బరతఃప్రమాణత్వాపత్తి సంభవింపఁగలదు. ఎందులకన? అందు గూడఁ బెక్కురకములగు నితిహాసములు గలవు. ఎట్లంటిరేని, ఋగ్వేదము నాల్గవమండలములో నాల్గవసూక్తములో సుసజ్జితుఁడును, గజారూఢుఁడునైన యొకరాజుగారి యుద్ధగమనము వచింపఁ బడియున్నది. ఆ నాల్గవ మండలములోని తృతీయ సూక్తమునం దైరావతమను గజము, ఉచ్చైశ్రవము మున్నగు నశ్వముల వివరణమున్నది. సప్తమమండలములోని ౧౮వసూక్తమునందు సుదాసుఁడను వానియొక్కయుఁ, జతుర్థమండలము లోని ౧౮, ౨౬ వ సూక్తములందు కుత్సితునియొక్కయు,


CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

ఇంద్రుని యొక్కయు శత్రుసంహారము లిఖింపఁ బడియున్నది. కుయవ, అయు, కృష్ణదస్యుల వివరణము ప్రథమ మండలములోని ౧౦౪ వ సూక్తమునందును, సప్తమమండలములోని [illegible]౬ వ సూక్తమునందును గలదు. "దుర్యోణి" యను పార్థివుని సంగతి, ప్రథమమండలములో ౧౭౪ వ సూక్తమునం దున్నది. ఈ ప్రథమ మండలములో ౧౧౬ వ సూక్తమునందు రాజర్షి యగు తుగ్నుఁడు, తనకుమారుఁడగు భుజ్యుఁడనువానిని సైన్యముతోఁగూడ దిగ్విజయముఁ జేయుటకై పంపించినట్లు వర్ణింపఁబడియున్నది. షష్ఠమండలములోని ౭౫ వ సూక్తమునందు గుఱ్ఱము, విల్లమ్ములు మొదలగువాని వర్ణనము విశేషముగాఁ గలదు. ఈ గజ, వాజి, ధను, ర్బాణ, నర, నరేంద్ర, రాజర్షులు మొదలగువారి యితిహాసము లన్నింటిని ఋగ్వేదమునందుఁ జూచుటవలన, ఆ మనుష్యులు మున్నుగువారు జన్మించినతరువాతనే ఋగ్వేద సంహిత సృష్టియైనట్లు సిద్ధాంతము చేయనగునా? ఎప్పటికిని జేయఁగూడదు. అట్లు సిద్ధాంతమైనచో మంత్రభాగముఁగూడఁ బరతఃప్రమాణము ననిత్యమును గావలసి వచ్చును. వెండియు నీ మనుష్యులయు, రాజర్షులయు నామముల యర్థములను గడబిడజేసి వేఱర్థములను చెప్పుటగూడఁ గేవలము పాండిత్యాభిమానమే యగును. కాని సత్యము గానేరదు. ఇదంతయు వేదమునం దలి త్రికాల దర్శిత్వము నెరుక

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

పఱచునదిగానై యున్నది. దేనియందుఁ గల్ప, కల్పాంతరము లందలి జ్ఞానము దర్పణమువలెఁ బ్రకాశించుచున్నదో యట్టి దానికి భూత, భవిష్య, ద్వర్తమానకాలములందలి స్థితిగతులను దొలుతనుండియే చెప్పుట, దుర్ఘటమైనపని యెంతమాత్రమును గాదు. అందువలన బ్రాహ్మణభాగ విషయమునం దిట్లు సందే హింపఁ దగదు.

జైమినిమహర్షి, మంత్రము బ్రాహ్మణము అను నీరెంటిని గూడ వేదమని చెప్పినట్లీవఱకే సిద్ధాంతీకరింపఁ బడినది. ఆ మహర్షులవారు తమచే రచింపఁబడిన పూర్వ మీమాంసా దర్శనమందుఁ గూడ మంత్రముయొక్కయు, బ్రాహ్మణము యొక్కయు లక్షణమును వర్ణించు సమయమం దిట్లు సూత్రీక రించియున్నారు.

"తచ్చోదకేషు మంత్రాఖ్యా శేషే బ్రాహ్మణశబ్దః"

ఇందా మహర్షి స్తుతిమూలమునఁ బ్రరోచక శ్రుతులను మంత్రమని చెప్పి మంత్రములుగాక మిగిలిన వేదభాగమును బ్రాహ్మణమని యనెను. బ్రాహ్మణము వేదము గాకపోయిన చో జైమినిమహర్షి "శేషే బ్రాహ్మణశబ్దః" అను సూత్రమును రచించియే యుండఁడు. కారణమేమన? ఒక పదార్థముయొక్క శేష మాపదార్థమునకంటె వేఱయినది గాఁజాలదు. దానిలోనే యంతర్భూతమై యుండును. దీనింబట్టి బ్రాహ్మణభాగ మెప్పుడు

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

మంత్రభాగావశిష్టాంశమైనదో యప్పుడే దీనికి స్వతఃప్రమాణత్వము సిద్ధించుటకే విధమగు సందేహము నుండదు. న్యాయదర్శనమును రచించిన గౌతమమహర్షి, వేదప్రమాణమును గూర్చి యిట్లు కటాక్షించి యున్నాఁడు.

"తదప్రామాణ్యమనృతవ్యాఘాత పునరుక్తదోషేభ్యః"

అనృతము, వ్యాఘాతము, పునరుక్తి మున్నగుదోషము లున్నందువలన వేద మప్రామాణ్యము. ఈ న్యాయదర్శనమునకు భాష్యమును రచించిన వాత్స్యాయనమహర్షి యీ సూత్రమున కిట్లు భాష్యము వ్రాసియున్నారు.

"పుత్రకామః పుత్రేష్ట్యా, యజేతేతి నేష్టౌ సంస్థితాయాం పుత్రజన్మ దృశ్యతే। దృష్టార్థస్య వాక్యస్య అనృతత్వా దదృష్టార్థమపి వాక్యమగ్నిహోత్రం జుహుయాత్ స్వర్గకామః ఇత్యాద్యనృత మితిజ్ఞాయతే"

ఎవనికిఁ బుత్రేచ్ఛ గలుగునో వాఁడు "పుత్రేష్టి" యను పేరుగల యజ్ఞమును జేయవలసినదిగా వేదమం దున్నది. అయితే పూర్వోక్తయజ్ఞమును జేసినప్పటికిఁగూడ మనుష్యులకనేకులకుఁబుత్రులుఁగలుగుటలేదు.అందువలనఁబ్రత్యక్ష ఫలము నందనృత మెప్పుడైనదో యప్పు డదృష్టఫలము (అనఁగా అగ్నిహోత్ర మాచరించినచో స్వర్గము బొందుననునది) నకుఁ గూడ మిథ్యాత్వము గలిగి తీరునని సిద్ధాంతమగుచున్నది. ఆ వాత్స్యాయనుఁడే, వ్యాఘాతదోషమును జూపుటకిట్లు లిఖించుచున్నాఁడు.

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

"హవనే ఉదితే హోతవ్యం, అనుదితే హోతవ్యం సమయాధ్యుషితే హోతవ్యమితి విధాయవిహితం వ్యాహన్తి శ్యావోఽస్యాహుతి మభ్యవహరతియ ఉదితే జుహోతి, శబలోఽస్యాహుతి మభ్యవహరతియో అనుదితేజుహోతి శ్యావశబలౌ వాస్యాహుతిమభ్యవహరతోయ స్సమయాధ్యుషితే జుహోతి, వ్యాఘాతాచ్చాన్యతరన్మిథ్యేతి"

వ్యాఘాతదోషముగూడ నుండుటచేత వేదము ప్రమాణము గానేరదు. ఎట్లనఁ, సూర్యుఁ డుదయించిన పిమ్మట హోమము జేయవలసినదని యొకస్థలమునందును, దిరిగి మఱి యొకస్థలమునందు సూర్యుఁ డుదయింపకముందే హోమముఁ గావింపవలసినదని లిఖించియుండెను. ఇట్లే యుదయకాలమందు హోమము జేసినదోషమును, సూర్యోదయముకంటె ముందుగా హోమముసల్పిన దోషమును జెప్పియుండెను. ఈ రెండు మాటలు పరస్పర విరుద్ధము లగుటవలన బాధితము లగుచున్నవి. దీనినే వ్యాఘాత దోషమని చెప్పెదరు. ఈ ప్రకారముగా ననృతము, వ్యాఘాతము, మున్నగుదోషములు వేదమునఁ గన్పరచి దాని కప్రామాణ్యమును జూపుటకై వాత్స్యాయనమహర్షి చే నుదితహోమము, ననుదితహోమము, నగ్నిహోత్రము, బుత్రేష్టిలోనగు నేకొలఁదియజ్ఞములు దృష్టాంతములుగా నీఁబడినవో యీ దృష్టాంతములన్నియు బ్రాహ్మణభాగములోనివేసుమా. కాఁబట్టివాత్స్యాయనమహర్షి చేఁగూడ బ్రాహ్మణభాగము వేదమనిచెప్పఁబడినట్లు సిద్ధాంతితమయినది. మఱియు నీసంగతి యీ దృష్టాంతములవలన మనువుచేతఁ గూడ నంగీకరింపఁబడిన ట్లీవలకే వచింపఁబడినది.

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

"విధ్యర్థ వాదానువాద వచన వినియోగాత్"

వాత్స్యాయనమహర్షి, యీ సూత్రమునకు భాష్యముజేయు పట్టున విధి, అర్థవాదము, అనువాదములను పేర్లుగల మూఁడు విధములుగానుండు వచనముల లక్షణమును వ్రాసియున్నాఁడు. మఱియునతఁడు, వానికిఁగల సంబంధమును గన్పరచి యీ వచనములను లౌకికవచనము లని పలికి బ్రాహ్మణభాగము వేదము గాదని వచించెనని వాదించుట యెల్లవిధముల మిథ్యయగుచున్నది. ఎందులకందురా? అతనిచేతఁ దొలిసూత్రమునందే యనేకదృష్టాంతములతో బ్రాహ్మణభాగము వేదమని చెప్పఁబడెను. మఱియు నీ సూత్రపుభాష్యమందుఁ గూడ నిట్లు లిఖించెను.

"విధిస్తు వినియోగోఽనుజ్ఞా వా యథా అగ్నిహోత్రం జుహుయాత్ స్వర్గకామః"

అతఁడిట్లుచెప్పి తనచేఁ దొలుతఁ జెప్పఁబడిన యభిప్రాయమునే బలపరచుకొని యున్నాఁడు. కాని ఖండించుకొని యుండలేదు. విచారణీయాంశము మఱియొకటి యేమన, వేద మెప్పుడు పూర్ణవస్తువైనదో యప్పుడు దానియందు లౌకికములు, నలౌకికములు నగు సర్వవిషయములును రాఁగలవు. వేదమునందు లౌకికములగు పదార్థవిద్య (సైన్సు) కు సంబంధించినమాటలునుగలవు. మఱియు నలౌకికమగుబ్రహ్మజ్ఞానము

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

బోధించువిషయములనుగలవని యీవఱకే చెప్పఁబడినది. దీనిం
బట్టిబ్రాహ్మణభాగమందు విధివాదము, అర్థవాదము మున్నుగా
గలవచనములనుగని దానిని నలౌకిక రాజ్యమునుండిఁగ్రిందఁబడ
వేసి లౌకికరాజ్యములోనికిఁ దీసికొనివచ్చెడి ప్రయత్నము విచా
రశీలుని పనిగాని, వేదమందలి రహస్యమగు జ్ఞాన మెఱింగిన
వానిపనిగాని కాఁజాలదు. ఆకారణమువలన నిట్టి భ్రమకు లోఁ
బడఁ దగదు. మహాభాష్యకారులవారు వేదప్రమాణమును
గూర్చి దృష్టాంతములనిచ్చు సమయమందు బ్రాహ్మణభాగ
మందుండు నేమంత్రమును దృష్టాంతముగా నొసంగియుండలేదు.
ఇందువలన గో, వాజి, ప్రభృతి లౌకికదృష్టాంతములను
బ్రాహ్మణభాగములోనికి లాగి దానిని వేదత్వమునుండి పడఁ
ద్రోయఁజూచెదరు. కాని యీ సిద్ధాంత మత్యంత మకించిత్కర
ముగానున్నది. ఏమాటకైనను దొలుత నేప్రతిజ్ఞగావించి దృష్టాం
తము లీఁబడవు. కాని ప్రసంగమును బట్టియుఁ బ్రయోజనము
ననుసరించియు నవి వచ్చుచుండును. దీనింబట్టి మహాభాష్య
కారు లే ప్రసంగమం దెంతవఱకు దృష్టాంతములవలనఁ బ్రయో
జనము సిద్ధించునో యంతవఱకు మాత్రమే దృష్టాంతములిచ్చి
యుండవచ్చునని తెలియుచున్నది. ఈ విషయమం దవి మంత్ర
భాగమునుండి యిచ్చినారా? బ్రాహ్మణభాగమునుండి యిచ్చి
నారా? బ్రాహ్మణభాగమునుండి యీయనందున దానికిఁ

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

ప్రామాణ్యము లేదను నిట్టిచింత పడవలసిన యవసరమే లేదు. ఎందువలననఁగా, దృష్టాంతము సాధారణముగా యానద్వేద విషయక ముండినది. కాని వేదభాగవిషయక ముండినదిగాదు. రెండియు గుణ్ణము, గోవు, మొదలగు దృష్టాంతములు బ్రాహ్మణ భాగమునందుఁ గలవు. ఇట్లే యెక్కడనైన గోవాజి ప్రభృతి దృష్టాంతము లున్నచోనవి యన్నియు బ్రాహ్మణభాగములోనివే కానలయుననిచెప్పెడి సిద్ధాంతమెందువలనఁ గొఱగానిదని నమ్మఁడు. ఇట్లు, శ్రుతి, స్మృతి, పురాణ, దర్శన, సూత్ర భాష్యములు లోనగు నెల్ల ప్రామాణికగ్రంథములపై శ్రద్ధ నహించి విచారించినచో మంత్రబ్రాహ్మణములు రెండును వేదములోని భాగములే యని వివేకులగువారికిఁదెలియఁగలదు. కాఁబట్టి కర్మము, నుపాసనము, జ్ఞానములను నీమూఁటి శిక్షా మూలమున సమస్తజీవులకు సంసారసముద్రమును దాఁటుటకై మంత్ర బ్రాహ్మణారణ్యకరూపియగు త్రిమూర్తిగాఁ బ్రకాశిల్లు వేద మేకమాత్రాశ్రయస్థలమైయున్నది. ఇందుసందేహము లేదని తెలిసికొనుఁడు.

## —(*) నిశ్చితసిద్ధాంతవిషయములు (*)—

ఇంతవఱ కొనర్చిన సిద్ధాంతములనుబట్టి యీవిషయములు నిశ్చయమగుచున్నవి. వేద మనాది. వేదావిర్భావ విచారణము వలన వేదముభగవద్వాక్యమగుచున్నది! వేదమునిత్యము. వేదము

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

వాస్తవములో నాశన మెన్నటికిని గానేరదు. వేదప్రామాణ్య విషయమునం దెట్టిశంకయుఁ జేయుట యుచితముగాదు. త్రిభావాత్మకము, త్రిగుణాత్మకమునగు వేదము భావములతోడను నధికారములతోడను బూర్ణమైనందువలనఁ బూర్ణజ్ఞానమయ మగుచున్నది. వేదము, తెలియనివియు, నావశ్యకీయములును నగు విషయములనన్నిఁటిని బ్రకాశ పరచునది. వేదము, సంశయము విపర్యయము మున్నగుదోషములు లేనిది. వేదము, పరమేశ్వర దేవ, మహర్షులమూలమునఁ గ్రమముగాఁ బ్రకటింపఁ బడుచుండును. వేదము, ధర్మము, నర్థము, కామము, మోక్షములను చతుర్విధలాభములను సమానరూపముగా నిచ్చునది. వేదములోనిమంత్రములు, గద్యరూపముగా నుండనిమ్ము. పద్యరూపముగా నుండనిమ్ము, గానరూపముగానుండనిమ్ము, ఇట్లేఋక్కు-యజుస్సు, సామము, అథర్వములను పేరులతో నాలుగు రీతులుగా నుండనిమ్ము. ఎట్లున్నను వేదము వాస్తవమునకొకటియే సుమీ. మహాప్రళయమయినను వేదమునకు నాశనము లేదు. మహాప్రలయదశలో నీ వేదములు జ్ఞానరూపముతోఁ బరమాత్మయందు నిలిచియుండును. ప్రలయదశలో వేదము పరమాత్మయందు నిత్యరూపముతో భాసిల్లి సృష్టిదశయందు బ్రహ్మయనుమతిని బొందిన మహర్షుల యంతఃకరణములందుఁ



CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

ప్రకాశితమై యుండుపిమ్మట ఋక్కులమూలమున జగత్తునందక్షర (వర్ణ) సముదాయము స్థూలపుస్తకరూపముగాఁ బ్రకటితమగు చున్నది. వేదము పూర్ణజ్ఞానమయమును, త్రిగుణమయమును, త్రిభావమయమునగుటం బట్టి వానియందు జనులకైహలౌకికోన్నతిని, పారలౌకికోన్నతిని నిర్వాణముక్తిని గలిగించెడి సంపూర్ణ విషయముల వర్ణనము విరాజిల్లుచున్నది. వేదము, మంత్రభాగము, బ్రాహ్మణభాగము, ఆరణ్యకభాగము లను మూఁడుభాగములుగాను, కర్మకాండము, నుపాసనాకాండము, జ్ఞానకాండము లను మూఁడుకాండములుగాను విభాగింపఁబడినది. మంత్రభాగములాగున బ్రాహ్మణభాగము, ఉపనిషద్భాగములను నివిగూడ వేదమేయైయున్నది. సందియ మిందేమియు లేదు వేదమందలి యొక్కొక్క ఋక్కు, త్రిగుణములతోఁడను త్రిభావములతోఁడను బూర్ణమైనందువలనఁ బరమేశ్వర కథితములని యనుటకును సంశయింప నవసరము లేదు. వేదములోని యొక్కొక్క మంత్రము త్రిభావమయమై త్రివిధార్థబోధకమై యున్నది. దీని సంపూర్ణభావార్థబోధ సాధారణబుద్ధికి గోచరించునదిగాదు. వీనిని యోగులు, తత్త్వజ్ఞానులు మాత్రమే తెలిసికొనఁ గలరు. శిక్ష, కల్పము, మొదలగు వేదముయొక్క షడంగములను వైదికములగు సప్తదర్శనములను దివ్యపద్ధతితో స్వాధ్యయనము జేయని దే విద్వజ్జన సమూహము

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

నకుఁ గూడ వేదార్థము బోధయగుట యసంభవము. ఈ కారణముచేఁ బ్రత్యేకవ్యక్తి, వేదార్థమును గ్రహింపఁ జాలదు ఒక్కొక్క ఋక్కునకు ఛందస్సును, దేవతను, ఋషిని, దెలిసి కొనుటచేత, నా ఋక్కుయొక్క యధిభూతాధి దైవాధ్యాత్మ శక్తులజాడ చిక్కఁగలదు. ఎల్ల దేశములం దుండువారు నెల్ల తరగతులకుఁ జెందినవారునగు విద్వాంసులుఁగూడఁ బ్రపంచ మందు వేదముకంటెః బ్రాచీనమైనగ్రంథము మఱియొకటి లేదని యొక్క స్వరముతో సమ్మతించుచున్నారు. జ్ఞాన మనం తమైనందున వేద మనంతమైనది. కాని యీ వర్తమాన కల్ప మందు వేదమునకు ౧౧౩౦ శాఖలు ప్రచలితములైయుండెను. శాఖాసంఖ్యా విషయమం దనేక మతభేదములున్నను నీవఱకుఁ జెప్పిన సంఖ్యనే యంగీకరించినచో నీకల్పమందు ౧౧౩౦ మంత్రసంహితయు, ౧౧౩౦ బ్రాహ్మణమును, ౧౧౩౦ ఉప నిషత్తులు నుండినవని యొప్పుకొనవలసియే యున్నది. అయితే కాలపరిభావముచే నీసమయమందు దీనిలో సహస్రాంశము గూడ లభించుట లేదు. దూరదర్శులుగాని వ్యక్తులు కేవలము మంత్రభాగమునకే వేదమని చెప్పి బ్రాహ్మణభాగమునకు వేద మని చెప్పుటలేదు. వీరిసిద్ధాంత మెల్లరీతుల భ్రాంతిమయ మైనది. పురాణములలోని సమాధిభాష, పరకీయభాష, లౌకికభాషలవలె వేదములందుఁ గూడ నితిహాసము మున్నగు

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

వానియొక్క యనేకరీతులగా నున్న వర్ణనములు చిక్కుట
విజ్ఞానవిరుద్ధము గానేరదు.

వేదావిర్భావ విజ్ఞానమును దెలిసికొనుట కుపయోగిం
చెడి రెండు మూడు విషయముల నిచట జెప్పుట మంచిది.
జ్ఞాన మాత్మస్వరూపము. పూర్ణజ్ఞానస్థితి పరమాత్మయందే
నిత్యమైయున్నది. జ్ఞానావిర్భావ, తిరోభావములకు నాలుగు
దశలు గలవని తత్త్వజ్ఞానులగు మహాత్ములు తలంచుచున్నారు.
ఆభాసజ్ఞానము దార్శనికజ్ఞానము, తటస్థజ్ఞానము, స్వరూప
జ్ఞానములని వానినామములు. స్వరూపజ్ఞానముతోడనే ముక్తి
నొసంగెడి మహావిద్యకు సంబంధమున్నది. ఇయ్యవి జ్ఞానప్రకా
శకుడు, జ్ఞానప్రచారకుడునగు భగవంతునిలో నిత్యము విరా
జిల్లెడి దైవశక్తులై యున్నవి. ఇవి ఋషులని చెప్పబడుచున్నవి.
జ్ఞానమందలి యీనాల్గుదశలయొక్కయు జ్ఞానమునకును బ్రచా
రకులైన ఋషులయొక్కయు వర్ణనము నాటియొకసారి విస్తరిం
పబడును. ఏప్రకారముగా నధర్మనివారణమునకును, ధర్మరక్షణ
మునకును భగవంతునియంశావతారములు, బూర్ణావతారములు
నవసరమయినపుడెల్లం బ్రపంచమునందుం బ్రబలుచున్నవో
యట్లే యజ్ఞాననివృత్తికొఱకు, జ్ఞానప్రవృత్తికొఱకును బూర్వోక్త
నిత్యమహర్షుల యంశావతారములు, బూర్ణావతారములును
సమయ సమయములను బైలుదేరుచున్నవి. ఈ ఋషుల పూర్ణా

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

వతారముల పుట్టుక దఱుచుగా మన్వంతరమందలి తొలిసమయ మునసే కలుగుచుండును. ఆ సమయమందున్న మన్వంతరముల కుపయోగించు జ్ఞానమును బ్రకాశింపఁ జేయుటకు జ్ఞానము నకు బీజముగానున్న ఋక్కు లీపటుకుఁ జెప్పఁబడిన పూర్ణావ తారులగు మహాత్ముల యంతఃకరణమందు స్వయముగాఁ బ్రకా శితము లగుచున్నవి. కాలప్రభావముచే వేదములు లుప్తములు గాఁగాఁ దిరిగిమఱియొకమన్వంతరముయొక్క యాదియందు దిట్లే యివిప్రకటితము లగుచుండును. వేదసంబంధము ఆభాస, దర్శన, జ్ఞాన, విద్యలను నీ నాలుగింటితోఁ బాటైనప్పటికిని వేదా విర్భావ సంబంధము కేవలము జ్ఞానమునకుఁ దల్లియగు మహా విద్యతోడనే సాక్షాత్తుగా నున్నందున ఋషిగణ మితరసహా యము లేకుండ భగవత్కృపచే ఋక్కు మొదలగు వేదము లను దమ యంతఃకరణమందుఁ బొందుచుండును. ఇదియే వేదా విర్భావముయొక్క యతిగూఢమైన రహస్యము. ఇద్దాని నెఱింగి తద్ధర్మములను భక్తిశ్రద్ధలతో నాచరించి యైహికాముష్మిక సుఖంబులం బొందుదురుగాక.

శ్రీకృష్ణార్పణమస్తు.

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

శ్రీ

# వేదాంగములు



శ్లో॥ షడంగ సముపేతాయ
సప్తదర్శన హేతవే
నమః పురాణపూర్ణాయ
బ్రహ్మణే వేదరూపిణే॥

(షడంగావశ్యకత)

వేదార్థము సాధారణముగా గోచరించునది కాదు. సమాధియందున్న పురుషులే బ్రహ్మదర్శనమందు సమర్థులైనట్లు సమాధి యుక్తాంతఃకరణ మూలముననే శబ్దబ్రహ్మరూపియైన వేదముయొక్క యథార్థమగు నర్థమును గ్రహింపఁగలరు. యోగిపదమును బొందెడి సదృష్టవంతుఁడు మిక్కిలియరుదుగా నుండును

"మనుష్యాణాం సహస్రేషు, కశ్చిద్యతతిసిద్ధయే
యతతామపి సిద్ధానాం, కశ్చిన్మాం వేత్తితత్త్వతః"

(భగవద్గీత)

వేలకొలఁదిగనున్న మనుష్యులలో నెవఁడో యొకఁడు యోగియగుటకుఁ బ్రయత్నింపఁ గలఁడు. అట్లు ప్రయత్నించు

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

వారలలో నొకఁడు సమాధిస్థుఁడై భగవత్సాక్షాత్కారమును జేసికొనఁ గలఁడు. వేదవాక్యమే జ్ఞానమును, విజ్ఞానమును దెలిసికొనుటకు ముఖ్యలౌకికోపాయ మగుచున్నప్పుడు లౌకిక రూపమున వేదమును దెలిసికొనుటకు యుక్తియే సర్వసాధారణముగా హితకారి కాఁగలదు. మఱియు వేద మలౌకిక జ్ఞానరాశి కాధారమైనప్పుడు లౌకికములగు పురుషార్థముల మూలమున నలౌకికమగు వైదికజ్ఞానమును బొందించుట కుపయోగించు బుద్ధి లాభమున కేదో యొక యసాధారణప్రయత్నమవసరమైయున్నది. అనఁగాఁ బండితులు సాధారణములైన వ్యాకరణశాస్త్రము, కావ్యము, నిఘంటువులు, మున్నగువానిని జదువుటచేతనే యితరములగు సర్వ సంస్కృతగ్రంథములను సమన్వయించెడి బుద్ధిని గలిగించుకొనినట్లు కేవలము సామాన్య యోగ్యతవలన వైదికజ్ఞాన మెప్పటికిని సిద్ధించుకొననేరరు.

వేదాంగములందుఁ బూర్ణయోగ్యతను సంపాదింపనిదే జిజ్ఞాసుసముదాయము. వేదార్థము నెప్పుడుగూడ గ్రహించుటకు సమర్థము గాఁజాలదు. ఒక పురుషునిఁ బరీక్షింపఁ దలఁచినప్పుడాతనియాకృతి, చేష్ట,గుణము,స్వభావము,చరిత్ర,మున్నగు విషయముల ననేకములను దొలుతఁ దెలిసికొనవలసిన యవసరమున్నది. ఇట్లన్ని విషయములను దెలిసికొనినందువలన నాతనిని బరిపూర్ణముగా నెఱుంగుటకు వీలుగల్గును. ఈ నియ

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

నము ననుసరించి షడంగములను సంపూర్ణముగా నభ్యసించి నప్పుడే వేదాధ్యయనమూలమున వైదిక తాత్పర్యమును గ్రహించెడిబుద్ధి సంపాదింపఁ బడును.

"శిక్షా కల్పో, వ్యాకరణం, నిరుక్తం, ఛందో, జ్యోతిషమితి"
(ముండకోపనిషత్తు)

శిక్ష, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, ఛందము, జ్యోతిషము, లని వైదిక షడంగనామములు.

"ఛందఃపాదౌతు వేదస్య, హస్తౌ కల్పోఽథ కథ్యతే
జ్యోతిషామయనం చక్షు ర్నిరుక్తం శ్రోత్రముచ్యతే
శిక్షాఘ్రాణంతు వేదస్య, ముఖం వ్యాకరణం స్మృతం"

ఈ వేదపురుషునకు ఛందశ్శాస్త్రము చరణములును, కల్పశాస్త్రము (కర్మకాండగ్రంథము) హస్తములును, జ్యోతిశ్శాస్త్రము నేత్రములును, నిరుక్తశాస్త్రము కర్ణములును, శిక్షాశాస్త్రము నాసికయును, వ్యాకరణశాస్త్రము ముఖమునై యున్నవి.

—○(శిక్షా శాస్త్రము.)○—

శిక్షాశాస్త్రమనఁగ వేదమును బఠించెడి పద్ధతినిక్కటముగానున్నది. వైదికజ్ఞానమును గడించుటకుఁ దదధ్యయనమే మొదటిమెట్టు. ఈకారణముచేత శిక్షాశాస్త్రమన్నిటికంటెఁ దొలుత నేర్వవలసినయవసరమున్నది. శబ్దముతోఁబాటు శాబ్దిక భావమునకు, వాచకముతోఁ బాటు వాచ్యమునకును దాదా

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

త్మ్యసంబంధముగలదు. ఈవిషయము దర్శనశాస్త్రములచేఁ జాలఁ జక్కఁగా నిరూపింపఁబడినది. ఎప్పుడు శబ్దము తన పూర్ణరూపమునం దుచ్చరింపఁబడునో యప్పుడే శబ్దశక్తి పూర్ణముగాఁ బ్రకాశపఱుపఁబడఁగలదు. అలౌకిక శక్తిగల వేదములోని పదసముదాయ మూలమున వైజ్ఞానికశక్తితోఁ గూడిన సరియైనధ్వనితోఁ బఠించినప్పుడే పూర్ణలాభముగలుగఁ గలదు. వేదము శబ్దమయమగుబ్రహ్మము. మఱియు శబ్దవిజ్ఞాన ములోనున్న చక్కనిక్రమమునను సరించి వేదమునుబఠించుటకు గాని గానముజేయుటకుఁగాని తగినపద్ధతి యీశిక్షాశాస్త్రము నందు విశదీకరింపఁబడినది. శబ్దము, వర్ణాత్మకము, ధ్వన్యా త్మకము. అను భేదములతో రెండువిధముల విభజింపఁపడినది. ఈ వేదపాఠమునకుఁ జేరిన కేవల వర్ణాత్మక శిక్షాంశము హ్రస్వాదిభేదములతో సాధారణశిక్షాశాస్త్రమందుఁ బొందు పరుపఁబడియున్నది. మఱియు ధ్వన్యాత్మకప్రకరణము "షడ్జము" మున్నగు విభాగము ననుసరించి గాంధర్వము మున్నగు నుప వేదములందు వర్ణింపఁబడినది. శబ్దబ్రహ్మయొక్క హ్రస్వాది విభాగమును, గానోపయోగమగు షడ్జాదివిభాగమును దాని పూర్ణరూపమును బ్రకాశపఱుపఁగలదు. స్వరమునకుహ్రస్వము మున్నగు మూఁడు సాధారణ భేదములును, షడ్జములోనగు



CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

నే కసాధారణభేదములను గలవు, సాధారణము, అసాధార
ణము, నగుటం బట్టి వానిమూలమున సాధారణశక్తియు, నసా
ధారణశక్తియు నుత్పత్తి యగుచున్నవి. సూత్రములందు సంగీత
సంబంధమున్నందున సామవేదమహిమ యన్నిటికంటెం బ్రశ
స్తమైనదని చెప్పంబడినది. వేదముయొక్క సాధారణశిక్షయందు
కేవలము హ్రస్వములోనగు మూడు స్వరభేదముల వర్ణనము,
బాహ్యశైలియు, హస్తచాలనాది బహిఃక్రియాశైలియు వచింపం
బడియున్నది. మఱియు సామవేదమునకు సంబంధించిన సంగీత
శిక్షయం దీమూడు స్వరభేదములతో నింక నేడు స్వరముల
యుత్పత్తిని జూపించి వానితోడ్పాటుచే "మూర్ఛన" మున్నగు
వానిని, నసాధారణ సూక్ష్మశక్తుల యుత్పత్తిమూలమున శబ్ద
విజ్ఞానమును, రెండియుం గొన్నివిశేషముల యలౌకికత్వమును,
బ్రకటింపంబడియున్నవి. పూజ్యపాదులగు మహర్షుల మూల
మునం బ్రకటింపంబడిన గాంధర్వోపవేదమును నేటికాలమున
సంగీతశాస్త్రమును కేవల లౌకికానందకరకళయని తలంచినట్లు
తలంపంగూడదు. మన యార్యుల సంగీతవిద్య, గొప్పనైజ్ఞానిక
శాస్త్రము; మఱియు నీ యలౌకికవిద్యయొక్క సహాయము
చేతనే వేదమంత్రములనుండి నలౌకికశక్తు లుత్పత్తి యగు
చున్నవి. పూజ్యపాదులగు నారదుండు లోనగు మహర్షులు
రచించిన శిక్షాగ్రంథములను జదివిన మొదల హ్రస్వాది స్వర

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

త్రియ ప్రస్తారమువలన సప్తస్వరములును, నిరువదియొకటి మూర్ఛనలును, నిరువదిరెండు శ్రుతులును, దరువాత వీని వ్యాపకమువలన ననేక రాగములును, ననేకరాగిణులు నెట్లు ట్లుద్భవించినసంగతి చక్కఁగాఁ దెలియఁ గలదు. సంగీతరత్నాకరమం దిట్లు వచింపఁబడి యున్నది.

"శ్రుతిభ్యస్తు స్వరాష్షడ్జ ర్షభగాంధార మధ్యమాః
పంచమో ధైవతశ్చాథ నిషాద ఇతిసప్త తే॥
తేషాంసంజ్ఞాస్సరిగమ పదనీత్యా పరాపతాః
దీప్తా యతాచ కరుణా మృదుర్మధ్యేతి జాతయః॥
శ్రుతీనాం పంచతాసాంచ స్వరేష్వేకం వ్యవస్థితాః
తేమంద్ర మధ్యతారాఖ్య స్థానభేదాత్త్రిధాపతాః॥
తఏవ వికృతావస్థా ద్వాదశ ప్రతిపాదితాః"

ఈస్వరవిభాగమువలన మనుష్యుని చిత్తమం దెట్టి ప్రభావముగల్గుట సంభవించును! ఈ నరుని శరీరముకూడ నొకయల్పబ్రహ్మాండము. సృష్టిప్రకరణ మందలి యేనియమము బ్రహ్మాండమునందున్నదో యా నియమమే యీశరీరమునందు గూడ నున్నట్లు కనుపడుచున్నది. ఈ సృష్టి నియమము ననుసరించి శబ్దసృష్టి, త్రిగుణభేదమువలనఁ బ్రథమస్థూలావస్థయందు హ్రస్వము మొదలగు మూఁడు భేదములతోడను, ద్వితీయ సూక్ష్మదశయందు సృష్టికి స్వాభావికములగు సప్త భేదముల మాదిరి సప్తభేదములతోఁ గూడికొన్నదియు నగుచున్నది.

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

ఈ రెండు భేదముల ననుసరించియే శిక్షాశాస్త్రములు రచింపఁబడినవి.

> ఆత్మా బుద్ధ్యా సమేత్యార్థాన్ మనో యుంక్తే వివక్షయా
> మనః కాయాగ్నిమాహంతి స ప్రేరయతి మారుతమ్॥
> మారుతస్తూరసి చరన్ మంద్రం జనయతి స్వరమ్॥
>
> (పాణినీయశిక్ష)

ఈ శరీరమందు స్వరసంబంధమైన సృష్టియగుచున్న సమయమునందా సృష్టి నియమము ననుసరించి తొలుత నాత్మ ప్రేరణముచే బుద్ధి, మనము, ప్రాణశక్తి, ప్రాణవాయువును క్రమముగాఁ బ్రేరేపింపఁబడి పిమ్మట శబ్దముజనించెడి సమయములో శరీరమందలి యాయా విశేషస్థానములను స్పృశించుచు శబ్దములను బ్రకటించుచున్నవి. ఒక్కొక్క స్వరముతోఁ గూడ నాత్మకుఁ దాదాత్మ్య (అభేద) సంబంధము గలదు. కాని యాత్మశక్తి, సరియైన శబ్దముయొక్క యాశ్రయముచే ధ్వనితమగుచున్నప్పుడే సంపూర్ణరూపముతోఁ బ్రకాశముగాఁగలదు. ఒక్కొక్క యధ్యాత్మ భావమునకుఁగల యధిభూతస్వరము నదును నున్న యాధిదైవశక్తి, కార్యకారిణి యగునప్పుడే యున్నదున్నట్లు ప్రకటనమగును. ఇఁక నేమన, పూర్వక్రమము ననుసరించి కార్యకారిణియగు నాధిదైవశక్తి యెల్లచోట్ల నిలుకడగా నుండెనిమొదలను, వాయువును శబ్దముగాఁ బరిణతము చేయుటముచే బలహీనమైన మొదలను, నే స్వరమూలమున

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

నట్టిశక్తి ప్రకటనమగుట కనకాశముండెడిదో యందట్టిది గలుగ నేరదు. దీనింబట్టి వేదమంత్రరూపమైన శబ్దబ్రహ్మమును నిజసంపూర్ణశక్తితోఁ గూడికొన్న భావమునందు స్థిరము చేయుటకై యీ శిక్షాశాస్త్రము రచింపఁబడినది. ఒక్కొక్క వేదమందలి యొక్కొక్క శాఖయొక్క యుచ్చారణమునకై శిక్షాగ్రంథము లుండెడివి. వీనిని "ప్రతిశాఖ" లని కూడఁబిల్చు చుండిరి. ప్రస్తుతసమయమందు సాధారణ శిక్షావిషయమై చాలఁగొలఁది గ్రంథములే చిక్కుచున్నవి. మఱియు మిక్కిలి యెక్కువగానున్న సామశిక్షాగ్రంథములు దాదాపు లోపించి పోయినవి. ఇట్లులోపించిపోవుటచే నార్యజాతికిఁ దీరనినష్టము గల్గినది. సామగాన యథార్థశైలి, ననుసంధాన పూర్వకముగాఁ బ్రకటించుట యత్యావశ్యకమై యున్నది.

—(*) కల్పశాస్త్రము (*)—

మంత్రమునకు సంబంధించిన క్రియలచే సిద్ధించిన యంశ ములంగూర్చి వర్ణించునది కల్పశాస్త్రమని చెప్పఁబడును. సరి యైనఫ్వని లేక ప్రకాశపరుపఁబడిన శబ్దబ్రహ్మరూపములగు వేద మంత్రములు ఫలప్రదములు గాఁ జాలనియట్లే వైదికక్రియలచే సిద్ధమైన యంశమందు నొక్కొక్కక్రియ యొక్క వైదిక కర్మ యందలి విజ్ఞానానుకూలమగు సాధనయుక్తి నవలంబింపనంత వఱకు నీ క్రియాసిద్ధాంత మెన్నటికిని సంపూర్ణఫలము నొసంగఁ

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

జాలదు. ఈవేదాంగమునందు "అగ్నిష్టోమము" మున్నగు నానా యాగములను, "ఉపనయనము" లోనగు నానాసంస్కారములను, బ్రహ్మచర్యము, గార్హస్థ్యము మొదలగు నాశ్రమములకు సంబంధించిన నానాకర్మములను, బహిరంగముగా సాధించెడి విధులు పరిపూర్ణముగాఁ జెప్పబడినవి. ఈ ప్రపంచము కర్మమయము. ఇందువలన వేదములందుఁ గర్మాధికారమన్నిటికంటె నధికకారణమగుటచేతఁ గల్పశాస్త్రముగూడ మిక్కిలి మెక్కుడగానున్నది. వేదమెన్ని శాఖలలో విభాగింపఁబడినదో యన్నియే స్వతంత్రములగు కల్పశాస్త్రములునుగలవు. ఈ శాస్త్రము సూత్రబద్ధమైనందున "కల్పసూత్ర" మనునామముతోఁ బ్రసిద్ధినిగాంచినది. ముఖమునుండి యెట్టి భావద్యోతక శబ్దము బయలువెడలునో యట్టిభావముతోఁ గూడిన బహిర్లక్షణములు గనుపరచినయెడల శబ్దమునకుఁగలశక్తి యింకఁగొంచెమధికమగుచుండుట లోకమునందుఁగూడ దృష్టిగోచరమగుచున్నది. ఫలితాంశమేమన, అంతర్జగత్తు, బహిర్జగత్తు, స్వరూపబ్రహ్మము, శబ్దబ్రహ్మము, కారణబ్రహ్మము, కార్యబ్రహ్మములకుఁ దాదాత్మ్య సంబంధమున్నకారణమునుబట్టి వైజ్ఞానిక యుక్తిచే నిర్ణయింపఁబడిన కర్మకాండములోని ప్రక్రియాసమూహము వేదమందున్న . యధ్యాత్మలక్ష్యమును సాధించుటకుఁ బరమోపయోగ్యమైయున్నది. సందియమించుకఁ బొందఁబడదు. వేద

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

ములోని ౧౧౩౦ శాఖలలో నెవరేశాఖకుఁ జెందినవారో వారు స్వశాఖలననుసరించి తమ కల్పసూత్రముల తోడ్పాటుతోఁ దమకు విహితమగు కర్మములను నియమములకుఁ లోఁబడిచేసి యభ్యుదయ నిశ్శ్రేయసములను బొందవలయునని కల్పశాస్త్రి తాత్పర్యము. నేఁటికాలమున వేదమందలి సంహితా, బ్రాహ్మణారణ్యక భాగములలో శతాంశముగూడ లభింపనియట్లే యతి విస్తృతమైన కల్పసూత్రములోఁగూడ నూఱవవంతు చిక్కుట లేదు. ప్రస్తుతమునఁ గ్రియాకాండమునందు వ్యవహారములో నున్న కల్పసూత్రములు ముఖ్యముగా మూఁడుభాగములందు విభాగింపఁబడినది. శ్రౌతసూత్రము, ధర్మసూత్రము, గృహ్యసూత్రము, లని వానినామములు. శ్రౌతసూత్రమునందు యజ్ఞయాగాదివిధులు చూపఁబడినవి. జనసంఘమెట్లు జీవింపవలసినది యెట్లు కాలయాపనము జేయవలసినది, యెన్ని నియమముల నెట్లెట్లు పాటింపవలసినది యీ మున్నగు విషయములన్నిఁటిని తెలియజేయు పద్ధతి ధర్మసూత్రమునందుఁ గలదు. గృహ్యసూత్రమునందుఁ బుట్టినదిమొదలు గిట్టునఱకుఁ దలిదండ్రులు, సుతులు, సతులు, పతులు, మొదలగువారినెట్లు ప్రేమింపవలయునో యెవరెవరియెడల నెట్లెట్లు ప్రవర్తింపవలయునో యెవరెవరిని నెట్లు గౌరవింపవలయునో యేకార్యములను జేయవలెనో మున్నగు గృహధర్మవిషయము

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

లన్నింటిని బోధించువిధులుగలవు. ఇప్పటికిని గృహ్యసూత్రము ననుసరించి జాతకర్మము, వివాహము మున్నగు నిత్యనైమిత్తికకర్మములు గావింపఁబడుచున్నవి. ఇప్పుడు చెప్పఁబడినమూఁడు కక్ష్య (తరగతి) లుగా నుండు సూత్రములకుఁ దిరిగి యనేక శాఖలున్నవి. శ్రౌతసూత్రమందలి శాఖలలోనుండి "ఆశ్వలాయన, సాంఖ్యాయన, మశక, లాట్యాయన, ద్రాహ్యాయన, బౌధాయన, భారద్వాజ, ఆపస్తంబ, హిరణ్యకేశిన, కాత్యాయనములును, ధర్మసూత్రములోనున్న శాఖలలోనుండి "వాసిష్ఠగౌతమ, బౌధాయన, ఆపస్తంబములును, గృహ్యసూత్ర శాఖలలోనుండి "సాంఖ్యాయన, ఆశ్వలాయన, పారస్కర, గోబిల, మను పేరుగలవియు నెన్నఁదగినవి. శ్రౌతసూత్రములోని యాశ్వలాయనము, సాంఖ్యాయనము లను నీరెండు శాఖలు ఋగ్వేదములోనివి. మశక, లాట్యాయన, ద్రాహ్యాయనశాఖలు సామవేదములోనివి. బౌధాయన, భారద్వాజాపస్తంబ హిరణ్యకేశినములు కృష్ణయజుర్వేదములోనివి కాత్యాయనశాఖ, శుక్ల యజుర్వేదములోనిది. మశకమను శ్రౌతసూత్రమందు భిన్నభిన్న యజ్ఞముల మంత్ర సమూహములు వ్రాయఁబడినవి. బౌధాయనాది శ్రౌతసూత్రములందుఁ గృష్ణయజుర్వేదములోనున్న యజ్ఞములక్రమము వర్ణింపఁబడినది. ధర్మసూత్రములందు మానవధర్మసూత్రములే ప్రధానము

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

లైయుండెను. పూర్వకాలమునందు వీనికి గొప్పగౌరవముండెడిది. ఈసూత్రము లిప్పుడంతగస్పష్టవు. ఐనను వాసిష్ఠ, గౌతమ, ధర్మ సూత్రములందా సూత్రములలోని యే యనేకాంశము లెత్తివ్రా యఁబడియున్నవో యవియన్నియు నిప్పుడుగూడఁ బ్రచారము లోనున్నవి. మానవయాజ్ఞవల్క్యాది సంహితల సముదాయ మంతయు నాధర్మసూత్రములోనుండియే యుద్భవించినది. వివా హోపనయన శ్రాద్ధాది సమయములందలి యాజ్ఞిక కర్మముల న్నియు గృహ్యసూత్రముల ననుసరించియే కావింపఁబడుచుం డును. శ్రౌతసూత్ర, ధర్మసూత్ర, గృహ్యసూత్రములను నీ మూడింటిని గలిపి కల్పసూత్రమని పిలిచెదరు. ఆపస్తంబుని కల్పసూత్ర మిప్పటికిని జిక్కుచున్నది. అద్దాని మొదటి ౨౪ భాగములందు శ్రౌత (యజ్ఞయాగాది) విషయమును, దరువాతి యిరువదాఱవ, యిరువదేడవభాగములందు గృహ్య సూత్రవిషయములును, ౨౮,౨౯వ భాగములందు ధర్మసూత్ర విషయములును గూర్పఁబడియున్నవి. దానిముప్పదవ (సులభ) సూత్రమునందు యజ్ఞమునకు వేదికనెట్లు నిర్మింపవలసినదియు నావిధిఁజూపఁబడినది. దీనివలనఁ బ్రాచీనకాలమందలి యార్యుల భూమితి (జామిట్రీ) విద్యయందలి నేర్పుగూడ విశదముగాగలదు



CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

—— (వ్యాకరణశాస్త్రము.) ——

శిక్ష, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, ఛందము, జ్యోతిషములను, నీయాఱును, విద్యార్థుల శిక్షాక్రమము ననుసరించి వరుసగానొకటితరువాత నొకటివ్రాయఁబడుచున్నవి. కాని వాస్తవమునకు శిక్షతోఁగూడ ఛందస్సునకు, వ్యాకరణముతోఁగూడ నిరుక్తమునకుఁ, గల్పముతోఁగూడ జ్యోతిషమునకు గొప్ప సంబంధముగలదు. ఈషడంగములలోఁ గ్రియాసిద్ధాంశమును విచారించుటచే శిక్షయు, సౌపపత్తిక విషయవిచారణముచే వ్యాకరణమును బ్రథమమందుఁ గావలసినయంగములు. ఈయంగములెల్లను వైజ్ఞానికవిచారముతోఁబరిపూర్ణములైయున్నవి. వ్యాకరణము, శబ్దముల ననుశాసించుటకు ద్వారరూపముగానుండును. అంతర్జగత్తునకు సంబంధించిన రాజ్యములోఁబ్రవేశించుటకు యోగశాస్త్రముద్వారరూపమైనట్లును, బతంజలిభగవానులవారిచేఁ "అథయోగానుశాసన" మ్మనిచెప్పఁబడి మొదలిడఁబడినట్లును, శబ్దబ్రహ్మరూపమగు స్థూలరాజ్యమునందు యానత్పదార్థములను గ్రహించుటకొఱకు వ్యాకరణశాస్త్రము వేదమునకు ద్వారరూపమైయున్నది. గావునే దీనినిగూడఁబతంజలి మహర్షులవారుఁ'అథశబ్దానుశాసన', మ్మని ప్రారంభించియున్నారు. శబ్దమయమగు సృష్టిజరుగుచున్నప్పుడు భావమునుండి వృత్తికిని, వృత్తినుండి శబ్దమునకు నుత్పత్తిగల్గుచున్నట్లే యంతర్జ

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

గత్తునుండి బహిర్జగత్తునందు శబ్దావిర్భావము గలుగుటలకై శబ్దో త్పత్తిని జేయుశక్తి, పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరులను నామములతో నాల్గుభేదములు గావింపబడినది. ఆప్రకారమే శాబ్దికసృష్టి లయమగుసమయమున నసంగా శబ్దమంత్రరాజ్యమందుఁ బ్రవేశించినప్పుడు శబ్దమునుండియర్థము, నర్థమునుండి భావమును బుట్టుచున్నవి. సంస్కృతభాష, తననామమునకుఁ దగినట్లు సంస్కృతమును, దన సర్వాంగములందుఁ బూర్ణమైనందు వలన సమస్త విధముల నియమబద్ధమునై యున్నది. ఈకారణమును బట్టి సంస్కృతభాష కితరభాషలకంటె వ్యాకరణమావశ్యకమైయున్నది. వ్యాకరణమూలమున శబ్దముశుద్ధముగా వ్రాయఁబడినప్పుడును, జదువఁబడినప్పుడును మాత్రమే దానినుండి చక్కనియర్థముస్ఫురించుటవలన దుర్జ్ఞేయములగునభిప్రాయముల నెఱుంగుటకు సహాయమగుచున్నది. వ్యాకరణమునకుఁ గల ప్రత్యేకప్రభావమేమన, జ్యోతిశ్శాస్త్రముతో సమానముగా మనుష్యుల వైదిక లౌకిక కార్యములందు సంపూర్ణముగా సాహాయ్యముజేయుచుండును. ఈశాస్త్రములోని యనేక గ్రంథములు గొప్పవి లోపించిపోయినప్పటికి నేఁకొన్ని యామ్నగ్రంథము లిప్పటికిని లభించుచున్నవి.

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

—◯(నిరుక్తశాస్త్రము.)◯—

తొలుత వ్యాకరణము వలన శబ్దార్థమెఱుఁగఁబడుచున్నది. అటుతరువాత నిరుక్తశాస్త్రవిజ్ఞాన మూలమున వేదములోని భావార్థము బోధపడుటకు సాహాయ్యము చేకూరుచున్నది. నిరుక్తశాస్త్రమునకుఁగూడ "నిఘంటు" వనుపేరుతో నంతర్విభాగమొకటి గలదు. నిఘంటుమూలమునఁ గేవలము వైదిక శబ్దజ్ఞానము దెలిసికొనుటకు సాహాయ్యముగాఁగలదు. ఈశాస్త్రమును "వేదకోశ" మనియుఁ జెప్పెదరు. వేదమందలి వర్ణనములనువిచారించినయెడలవానియందెన్నోరకములభావము లున్నట్లును, సృష్టిలోనిత్రివిధపరిణామములననుసరించియాధ్యాత్మికాధి దైవికాధి భౌతికములను నీత్రివిధ భావములకుఁ గూడ వర్ణనమున్నట్లునుగనుపడుచున్నది. వీనినన్నిఁటియందునున్నయపరిమితజ్ఞానము,నిరుక్తశాస్త్రమునుజక్కఁగానెఱింగినచోఁబ్రాప్తించుచుండును. నిరుక్తవిజ్ఞానములోని సారమేమనఁగా, వ్యాకరణశాస్త్రము, శబ్దమును నిత్యమని తలంచినట్లే నిరుక్తశాస్త్రము భావమును నిత్యమని తలంచుచున్నదని తెల్లమగుచున్నది. వ్యాకరణ విజ్ఞానమూలమున నోంకారరూపములచే వేదమునకునిత్యత్వమున్నదని తెలియుచున్నది. నిరుక్తములోని యుత్కృష్ట విజ్ఞానము వలనఁగూడ భావమయమగు సభ్యాత్మస్వరూపమునకు నిత్యత్వము సిద్ధి

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

యగుచున్నది. దాన జ్ఞానమయమైన వేదమునకు నిత్యత్వము నిరూపింపఁబడినది. స్థూలమగు బహిర్జగత్తు మొదలుకొని సూక్ష్మాతిసూక్ష్మమగు నధ్యాత్మపదవివఱకు నన్నియుఁగూడ భావమయములే, సృష్టియొక్క యాది మధ్యాంతములను నీ మూఁడు దశలయం దసహాయమును, భావమయము నగు చేతన సత్తయొకటియే, సమానరూపముతోఁ వెలుఁగుచున్నది. దీనిం బట్టి భావముచేతనే జగము జనించినదని యెల్లతెఱంగుల నంగీకరింపఁదగియున్నది. భావము ప్రధానమైనందువలన శబ్దావలంబనముతో భావరాజ్యమందలి యథార్థభూమిలోఁ బ్రవేశింపఁ జేయుటయే యీశాస్త్రముయొక్క ఫలితాంశము తేలును. పూర్వకాలమందు నిరుక్త శాస్త్ర మత్యంతము ప్రచారములో నుండెడిది. పూజ్యపాదులగు మహర్షులీశాస్త్రమును గూర్చి లెక్కలేని గొప్పగొప్ప గ్రంథములను రచించిరి. కానియిప్పుడనేక కారణములచే నాగ్రంథములనామములను గూడఁగ్రహించుట మిక్కిలి దుష్కరమైపోయినది. "చతుర్వింశతిమత" మనుపేరుగలగొప్పపుస్తకములోనియేభాగముస్థానస్థానమందును గనుపడుచున్నదో దానిని బఠించుటవలననే నిరుక్తశాస్త్రముయొక్క యలౌకికత్వమును, దాని యసామాన్యవిస్తార విషయమును భావించుటకు వీలగుచున్నది. ప్రస్తుతకాలమున నిరుక్త శాస్త్రములోని యొకానొక యల్పభాగము యాస్కమునిచే

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

రచింపఁబడిన “షడంగనిరుక్త” మనుపేరుగల గ్రంథముగంటఁ బడుచున్నది. అది ప్రాచీనమగు నిరుక్తమనెడి కంకాళముయొక్క (చర్మమాంసములు లేని యొడలి యెముకలగూటి) ప్రతిబింబము మాత్రమైయున్నది. వేదములందు లాఘవ గౌరవము లుండుట వలన నిరుక్తశాస్త్రముయొక్క పూర్ణసహాయము లేకుండ భావము బోధయగుట యసంభవము. పూజ్యపాదులగు మహర్షులచే జెప్పఁబడిన దర్శనశాస్త్రములందు లాఘవ గౌరవముల యాధిక్యమే ప్రకారముగా నున్నదో దానిని భాష్యముల సహాయము లేకుండ దార్శనికసూత్రములను దెలిసికొనుటకై ప్రయత్నించినట్టి పండితులే స్వయముగాఁగనిపెట్టఁ గల్గుదురు. వేదము, సమస్తదార్శనికతత్వమునకును, విజ్ఞానములకును ఖనియై యున్నది. ఈకారణముచేతవానియందలి లాఘవగౌరవ విచారము పరమావధిజెందుననుటలో సందేహమేమియు లేదు. వేదములలోని యీలాఘవగౌరవవిచార మెన్నోవిధముల విభజింపఁబడినది. మొదటిది త్రిభావాత్మకము ఇదియిదివరకే యిందుఁ జెప్పబడినది. రెండవది. సప్తవిజ్ఞానాత్మకము. దీనివర్ణనము సప్తదర్శన విషయమునందు సంగ్రహించిచెప్పఁబడును. యజుర్వేదమందిట్లున్నది.

యేతే పాశా వరుణ సప్తసప్త త్రేధా తిష్ఠన్తి విశితారుశన్తః
సినన్తు సర్వేఽనృతం వదన్తం యస్సత్యవాద్యతితం సృజన్తు

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

ఈత్రివిధభావములే వరుసగా జీవుని త్రివిధసుఖముల యొక్కయు, త్రివిధ దుఃఖముల యొక్కయు ననుభవమునకు హేతువగుచున్నవి. మఱియుసప్తవిజ్ఞాన మయమగు సప్తదార్శనికభూమియే సాధకునకు ముక్తిపదము బొందించుటకై సప్త నియమములకు లోఁబడిన సోపానమైయున్నది. తదతిరిక్తమైన త్రిగుణభేదముచేతసత్త్వరజస్తమోగుణముల ననుసరించియుత్తమ మధ్యమాధమాధికార రహస్యముల భేదము వేదములం దుండుటయవశ్యమవసరమైయున్నది. ఎందులకనఁగా, ఆభేదము గూడఁ త్రిగుణమయమగు విశ్వములో నంతర్వ్యాప్తమగు శబ్ద బ్రహ్మమే. వెండియుఁ గర్మోపాసనాజ్ఞానములను నీమూఁడు కాండములందే యంతర్యాగ, బహిర్యాగములను రెండువిధ ముల యాగములగుటగూడ సర్వమాన్యమై యున్నది.

"సర్వేవేదా అంతర్యాగపరా బహిర్యాగ పరాశ్చేతి"

[ఋగ్వేద భాష్యము)

వేదముయొక్క లాఘవ, గౌరవ, విచార విషయము నందు సాధకులెంత యధికముగా ననుసంధింపఁ గల్గుదురో యంత యతిశయముగానే దాని యనంతభావములలోని యలౌ కికతాత్ప్రభావము కంటఁబడునని ఫలితాంశము. ఈవేదోక్త మగు ననంతభావరాజ్యమును ప్రకాశపఱచుటకు నిరుక్త శాస్త్రము ముఖ్యాధారమైయున్నది.

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

—○(ఛందశ్శాస్త్రము.)○—

ఛందశ్శాస్త్రము కొంతవిలక్షణముగానేయుండు. శిక్షా శాస్త్రము స్వరసహాయముతో వైదికములగు కర్మకాండము నందును, నుపాసనా కాండమునందును, సాహాయ్యమెట్లుచేయుచున్నదో యట్లే యీఛందశ్శాస్త్రముగూడ ఛందస్సునందలి విజ్ఞానముయొక్క తోడ్పాటుతో నలౌకికశక్తులఁబ్రకటించి వైదిక జ్ఞానము విస్తరింపఁ జేయుటయందును గర్మసాఫల్యము గలిగించుటయందును, విశేషముగా నుపకరించుచున్నది. సిద్ధరూపమునను, సాధకరూపమునను, ధ్వనితోఁగూడ నక్షరమున కెట్లు సంబంధము గల్గుచున్నదో యానియమము ననుసరించి శిక్షా శాస్త్రసంబంధము ఛందశ్శాస్త్రమునకుఁ గలదని యెఱుఁగఁదగినది. స్వరముతోఁగూడినధ్వని, ధ్వనిమయమువర్ణమయమునైన రెండుభావములతోఁగూడసంయుక్తమైయుండును. అయితే యంతర్విభాగమునలనసార్థకమగుధ్వనియందు ఛందస్సు సంతతము నిలిచియేయుండును. ముఖమునుండి యేశబ్దముచ్చరింపఁ బడుచున్నదో, యది యేప్రకారముగా నవశ్యము స్వరమయ మగుచున్నదో యట్లే యది యవశ్యముగానే ఛందోమయము గూడ నగును. స్వరములోని స్వతంత్రభాగములను విచారించుట మూలమున నేప్రకారముగా స్వతంత్రశక్తులు మనుష్యుని యంతఃకరణమందుఁ బ్రకటమగుచున్నవో యాప్రకారము స్వతంత్ర

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

మగు ఛందోసమయము విశేష పత్రిక్రియలలోని ప్రత్యేకశక్తుల మూలమున నింకొక క్రొత్తశక్తి జీవుని యంతఃకరణమందుఁ బ్రాదుర్భవించుచున్నది. ఛందస్సమూహముగూడ విశేష శక్తితోఁ గూడి యున్నందున ఛందోజ్ఞానమును బ్రకాశపఱచుటకై వంద్యులగు మహర్షులీ ఛందశ్శాస్త్రమును రచించిరని తేలుచున్నది. శిక్షాశాస్త్రమూలమున హ్రస్వాదులు లేక షడ్జాది స్వరములు, శ్రుతులు, మూర్ఛనలు, రాగరాగిణీ సమూహములు స్వతంత్రముగాఁ దమతమ ప్రకృతిశక్తుల ననుసరించి శాంతము, కరుణ మొదలగు రసముల నుదయింపఁ జేయుచున్నట్లే స్వతంత్రములైన ఛందస్సమూహములుగూడఁ దమ తమ స్వతంత్రములైన ప్రకృతిశక్తుల ననుసరించి స్వతంత్రభావములను బుట్టించి వైదికక్రియలోని యేదో విలక్షణమైన కార్యమందే యాసక్తి గలుగునట్లు చేయుచున్నవి. ఈ కారణమువలన స్వతంత్రమైన ఛందస్సు స్వతంత్రకార్యమునం దక్కఱను వచ్చుచుండును. వేద, శాస్త్రములం దీరీతిగా ఛందోవిషయమును గూర్చి లిఖింపఁబడినది.

త్రిష్టుభా భవతి స్సేంద్రియత్వాయ గాయత్ర్యా త్రివృత్కృత స్సం యాజ్యేస్వీత తేజస్కామో బ్రహ్మవర్చస్కామస్తేజో వై బ్రహ్మవర్చః గాయత్రీ తేజస్వీ బ్రహ్మవర్చస్వీ భవతి య ఏవం విద్వాన్ గాయత్ర్యౌకురుతే ఉష్ణిహా వాయుష్కామః కుర్వీత



CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

అనుష్టుభౌస్వర్గకామః కుర్వీత ద్వయోర్వా అనుష్టుభోశ్చతుష్షష్టి రక్షరాణి. త్రయఇమ ఊర్ధ్వాఏకవింశాలోకాఏవవింశత్యైక వింశత్యైవేమాల్లోకాన్త్సో హాతిస్వర్గఏవ॥

వైదికములగు నేడు ఛందస్సులను గూర్చి (దార్శనిక సప్తప్రాకృతిక పరిణామమునకు మూలభూతమ్మలైనవి) విచారించినచో వైదిక చ్ఛందస్సులోని వైజ్ఞానికభిత్తికిఁగొంతప్రమాణము లభింపఁ గలదు. సాధకునకు లక్ష్యము స్వర్గమగుగాక లేక లౌకికములగు భోగవాసనలగుగాక! లేక మోక్షసిద్ధియగు గాక ఛందోవిజ్ఞానమయమగు వైదికమంత్ర సమూహమును ఛందో విజ్ఞానము ననుసరించి యుపయోగించుకొన్నచోఁ గోరిక లీడేరఁగలవు. ఇందు సందేహ మేమియు లేదు. వైదికానుష్ఠానాదులందు ఛందోవిచార మధికముగా నుండుటం బట్టి యదృష్టఫలమును గల్గించెడి వేదమంత్రముల శక్తికి ఛందోవిజ్ఞానముగూడ సంపూర్ణసహాయముఁ జేసెడి విలక్షణతయుఁ గనుపడుచున్నది. ప్రకృతి యనంతమైనది. ఇందువలన ఛందస్సు గూడ ననంతమైనది. ఛందశ్శాస్త్రమును జెప్పిన మహర్షులు జీవులకొఱకుఁ బ్రధానములగు ఛందస్సులను నియమములకు లోఁబఱచి ఛందశ్శాస్త్రమునందుఁ బ్రకటించియున్నారు. వైదికములగు ఛందశ్శాస్త్రగ్రంథములు చాలవఱకు లోపించి పోయినవి. ఈ శాస్త్రములోని యల్పాంశమే యిత్తఱిఁగనుపడు

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

చున్నది. దీనిబీజము సంహితయందును, దీని యంకురోత్పత్తి యారణ్యకమునందు మఱియు శాఖోపశాఖ లుపనిషత్తులందు, నున్నదని చెప్పవచ్చును. ఛందోజ్ఞానము లేనిచో యజ్ఞకర్మము గాని వేదాధ్యయనముగాని యసంపూర్ణముగా నుండిపోవును. వేదమునం దేడు ఛందస్సులు చెప్పఁబడినవి. గాయత్రి, ఉష్ణిక్ అనుష్టుభ్, బృహతీ, పంక్తి, త్రిష్టుభ్, జగతి, యని వాని నామములు. ప్రాత్యాహిక (ప్రతిదినమునకు సంబంధించిన) సంధ్యలో వీనివర్ణనములన్నియుఁ జిక్కుచున్నవి. ఇరువదినాలు గక్షరములలో మూఁడుచరణములుగాఁ గూర్పఁబడిన ఛందస్సు గాయత్రి యని చెప్పఁబడును. ఉష్టిక్ఛందస్సునం దిరువదెనిమి దక్షరములును, ననుష్టుభమందు ముప్పదిరెం డక్షరములును, బృహతియందు ముప్పదియాఱక్షరములును, బంక్తియందు నలుఁబదియక్షరములును, త్రిష్టుభమందు నలుఁబదినాలు గక్షరములును జగతీ చ్ఛందస్సునందు నలుఁబదియెనిమిది యక్షరములు నుండును. కాత్యాయన మహర్షి, తన "సర్వానుక్రమణిక" యను గ్రంథమునం దీ యేడు ఛందస్సులంగూర్చి వ్రాసియున్నాఁడు. తదితరకాలమం దెన్నిఛందస్సులు ప్రచారములోనికి వచ్చినవో యవియన్నియు లౌకికచ్ఛందస్సులై యున్నవి. సంస్కృతసాహిత్యములో ౨౦౦ కంటె నధికమైన ఛందస్సులుగలవు. వానిలోనుండి ౫౦ ఛంద

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

స్సులు సాధారణముగా వ్యవహారమునందుపయోగపడుచున్నవి. వృత్తము, మాత్రావృత్తము లను నీ రెండుభేదములు లౌకిక చ్ఛందస్సులోనివి. గురు, లఘు, స్వర సంఖ్యానియమము ననుసరించి వృత్తమును, కేవలము మాత్రానియమము ననుసరించి మాత్రావృత్తము ను ఛందస్సుయొక్క రచనమైయున్నది. లౌకికచ్ఛందస్సుయొక్క యెన్నిగ్రంథము లిప్పుడు ప్రచలితములైనవో వానిలోనుండి పింగలాచార్యునిచే రచింపఁబడిన "ఛందోగ్రంథమును, ఛందోమంజరియుఁ" బురాతనములై ప్రసిద్ధికెక్కినవి. లౌకికచ్ఛందస్సున కనేక భేదములును, గావ్యశాస్త్రములలో దాని కంతులేని మాధుర్యమున్నను ఆప్త ప్రమాణములనుబట్టి విచారించినచో వైదికచ్ఛందస్సునందే యాధ్యాత్మికశక్తి యున్నదని నిశ్చయ మయినది. ఋగ్వేదీయ ప్రతిశాఖాగ్రంథములోని శేషాంశమునందు వైదికచ్ఛందో విషయమై యెన్నో యధ్యాయములున్నవి. సామవేదాంతర్గత మైన నిదానసూత్రమునందుఁగూడ ఛందస్సునుగూర్చి విచారింపఁబడినది. ఎన్నో బ్రాహ్మణములలోఁగూడ ఛందోరహస్య వర్ణనములు గన్పట్టుచున్నవి.

## —(*) జ్యోతిషశాస్త్రము (*)—

సమష్టి, వ్యష్టి రూపములతో బ్రహ్మాండరూపిమైన యీ ప్రపంచమును బిండరూపియైన ప్రతిమనుష్యుని దేహ

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

మును నేకత్వసంబంధము గలవి. ఈ కారణముంబట్టి బాహ్యబ్రహ్మాండమం దేవియున్నవో యాదేవతలు, భూతములు, గ్రహములు నక్షత్రములు, మొదలగు వాని కేంద్రము లన్నియు నీ దేహమం దున్న ట్లార్య శాస్త్రములందు వర్ణించి యున్నారు.

"దేహేస్మిన్వర్తతే మేరు, స్సప్తద్వీప సమన్వితః
సరితస్సాగరా శ్శైలాః క్షేత్రాణి క్షేత్రపాలకాః॥
ఋషయోమునయస్సర్వే! నక్షత్రాణి గ్రహాస్తథా
పుణ్యతీర్థాని పీఠాని వర్తంతే పీఠదేవతాః"

ఇత్యాది

[శివసంహిత]

ఇట్టి సిద్ధాంతమే పాశ్చాత్య పండితులచేతఁగూడఁజేయఁబడినది. మొత్తముమీఁద మనుష్యుఁ డనంతమైన యాకాశమును వ్యాపించిన సౌరజగత్తున కొకయల్పమైన ప్రతికృతి (మచ్చు) గా నున్నాఁడు. సౌరజగత్తులోఁగూడ నిట్లేకత్వ సంబంధ ముండుటవలన సౌరజగత్తుననుసరించి దానియందు బరివర్తన మగుట యుక్తియుక్తమై యున్నది. ప్రాకృతికమగు సంతత్రాజ్యములోని మూలశక్తి, చేతనరూపము జడరూపములను రెండుభాగములందు విభాగింపఁ బడినట్లే ప్రతికృతిలోని బహిశ్శక్తియుఁగూడ సమరూపము, విషమరూపములను రెండు భాగములంపు విభజింపఁబడినది. ఈ రెండురీతులుగానున్న సమ, విషమములచేఁ దాడితమగు శక్తిమూలమును రెండుప్రకా

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

రములుగా నుండు స్వతంత్రకార్యము లగుచున్నవి. అనఁగా నొకశక్తిమూలమున ఆకర్షణము (Attraction) యొక్కయు మఱియొకశక్తిమూలమున వికర్షణము(Ripulsion)యొక్కయు వ్యాపారము జరుగుచుండును. ఈ విజ్ఞానరహస్య మేమనఁగా అంతఃకరణమందలి యీ రెండు శక్తులవలనను, వీనియాకర్షణ వికర్షణముల వలనను వీని సహాయమువలనను మనుష్యుల యాంతరంగిక వృత్తిలో మార్పు గలుగుచున్నట్లే సమష్టి బ్రహ్మాండములోని శక్తిమూలమునఁగూడ నీ బహిర్జగత్తునందు సృష్టి, స్థితి, లయ, రూపమైన యనేక విధములగు మార్పులు గలుగుచున్నవి. మఱియు మనుష్యుని శరీరమం దీశక్తులున్నట్లే సూర్యచంద్రాది గ్రహములందును, నక్షత్రములందు నున్నవి. ప్రకృతిలోని యీ శక్తుల ప్రభావ మేప్రకారముగా నాగ్రహములపై నుండునో యారీతిగా నాగ్రహాదులశక్తులు ప్రసరించు నంతదూర మన్యాన్యగ్రహాదులపైనను, నక్షత్రములపైనను, గ్రహనక్షత్రములలో నివసించు జీవసమూహముపైనను యథా క్రమము పడుచుండును. ఈ వైజ్ఞానిక సిద్ధాంతము ననుసరించి ప్రత్యక్షసిద్ధమైన గణిత జ్యోతిషమునకుఁ దాదాత్మ్య సంబంధ మప్రత్యక్షసిద్ధమగు ఫలితజ్యోతిషముతోఁ గూడ నున్నదని వచించుట, యుక్తియుక్తమును, విజ్ఞానసిద్ధమునై యున్నది, సూర్యసిద్ధాంత మిట్లుచెప్పుచున్నది.

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

"గణితం ఫలితం చైవ జ్యోతిషంతు ద్విధామతం"

జ్యోతిషము, గణితము, ఫలితము, లని రెండువిధముల నుండును. పురాతన కాలములో నిట్టి యలౌకిక విజ్ఞానమునకుఁ బరమోన్నతదశ భరతఖండమందుఁ గలిగియుండెను. పూజ్య పాదులగు మహర్షులలో ననేకు లిట్టి దివ్యశాస్త్రమున కాచార్యులుగా నున్నట్లు కనుపడుచున్నది. ఆశాస్త్రములో నున్న జ్యోతిషసంహిత లిప్పటికిని జాలవఱకుఁ గనుపడుచున్నవి. జ్యోతిశ్శాస్త్రప్రవర్తకులగు మహాత్ముల నామములు సూర్య సిద్ధాంతగ్రంథమం దిట్లు వ్రాయఁబడి యున్నది.

"సూర్యః పితామహో వ్యాసో వసిష్ఠో త్రిపరాశరాః
కశ్యపో నారదో గర్గో, మరీచిర్మను రంగిరాః॥
లోమశః పైలిశ్చైవ, చ్యవనో యవనో గురుః
శౌనకోఽష్టాదశశ్చైతే, జ్యోతిశ్శాస్త్రప్రవర్తకాః"

ఈ శాస్త్ర మితర వేదాంగములకంటె మిక్కిలి విస్తారముగలదియుఁ బరమావశ్యకీయమునై యున్నది. పూజ్యపాదులగు నామహర్షులుగూడ షడంగములను వర్ణించు సమయమందు షడంగములలోఁ జేరిన యీ జ్యోతిషముంగూర్చి యిట్లాదేశించి యున్నారు.

యథాశిఖా మయూరాణాం, నాగానాంమణయోయథా
తద్వద్వేదాంగశాస్త్రాణాం, జ్యోతిషం మూర్ధనిస్థితం
వేదాహి యజ్ఞార్థ మభిప్రవృత్తాః, కాలానుపూర్వా విహితాశ్చయజ్ఞాః
తస్మాదిదం కాలవిధానశాస్త్రం, యోజ్యోతిషం వేదసవేదయజ్ఞాన్॥

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

నెమిలులకు సిగయుఁ, భాములకు మణులు, శిరమునఁ దనరారుచున్నట్లే వేదాంగములగు శాస్త్రములకు జ్యోతిశ్శాస్త్ర ముత్తమాంగమై విరాజిల్లుచున్నది వేదములు యజ్ఞము కొఱకుఁ బ్రవర్తిల్లినవి. యజ్ఞమో కాలముననుసరించి ప్రవర్తించుచుండును. జ్యోతిషముకాలనిర్ణయమునుగావించెడిశాస్త్రము. ఈ శాస్త్ర మెఱింగినవాఁడే యజ్ఞముల గుర్తెఱింగి చేయఁ జాలును.

విచారింపఁగా సృష్టికి మూలకారణరూపియుఁ, గారణ బ్రహ్మాయునగు విశ్వకర్త, సృష్టి కర్తయై యున్నవాఁడు. కాని కార్యబ్రహ్మరూపిమైన యీ ప్రాకృతిక బ్రహ్మాండము దేశకాలములవలనఁ బరిచ్ఛిన్నమై యున్నది. మఱియుఁ గర్మముతోఁ గూడఁ గాలమునకు సంబంధమున్న కారణముచేతఁ గర్మమును గాలమున కధీనమైన దానిగా గ్రహింపవలసి యుండును. కానఁ గాల జ్ఞానమెఱింగి చేసినకార్యములే సఫలములగును. జ్యోతిషము కాలస్వరూపమును జెప్పునది. మఱియు దాని యుత్తరాంగమగు ఫలితజ్యోతిషము, కాలములో నిమిడియున్న రహస్యములను దెలియఁ బఱచునదియైయున్నది. దీనింబట్టి వేదములోని కర్మకాండమునకు జ్యోతిశ్శాస్త్రముతోఁ మిక్కిలి దృఢసంబంధమున్నట్లు తెలియుచున్నది. ఎందులకన, కర్మముకాలాధీనమై నప్పుడు కర్మకాండము గూడ జ్యోతిశ్శాస్త్రమున

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

కధీనముగా నుండుట శ్రేయస్కరముగాఁ గలదు. ప్రస్తుత కాలమునం దీజ్యోతిశ్శాస్త్రమునకుఁ బట్టిన క్షీణదశ గూడ మన యార్యుల సదాచారమునకుఁ గర్మకాండమునకును హానిం గల్గించు ప్రధానకారణమైనది. గణితజ్యోతిషమువలన బాహ్య జగత్తునకు సంబంధించిన గ్రహములయొక్కయు, నక్షత్రముల యొక్కయు మార్పును, గాలవిభాగమును నిర్ణయింపఁబడు చున్నది. ఇఁక ఫలితజ్యోతిషమూలమున గ్రహములు నక్షత్ర ములు మున్నగువానిగతుల సహాయముతో నీజగత్తుయొక్కయు, జగమునకు సంబంధించిన యావత్సృష్టి యొక్కయు మనుష్యులయొక్కయు నాంతరిక పరివర్తనములు నిర్ణయింపఁ బడుచున్నవి. జ్యోతిశ్శాస్త్రములోని యీ రెండంగములును మానవసంతానమునకు మహోపకారకములు. జ్యోతిషగ్రంథ ములం దీశాస్త్రమునకు సర్వాతిశయావశ్యకతయు, సర్వజీవ కల్యాణకారితయు, సర్వశాస్త్ర ప్రధానతయు వర్ణింపఁ బడి యున్నది. ఇది విచారశీలురగు మనుజుల కతిశయోక్తిగా నుండ నేరదు. తొంటిత జ్యోతిశ్శాస్త్రములోఁ బ్రధానములైన యార్ష గ్రంథములనేకములు లోపించిపోయెను. విచారించిచూచినచో నితరములగు వేదాంగములకంటె నీ వేదాంగగ్రంథము లిప్పటికి నెక్కువగాఁ జిక్కుచున్నవి, కాని పరిభాష ప్రధానములగు



CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

సిద్ధాంతగ్రంథములు జాలనఱకు లోపించినవి. రెండవది. ఈ శాస్త్రమునకు సంస్కారము చాలకాలమునుండి జరిగి యుండ లేదు. ఈశాస్త్రమునకు సంబంధ మాధిభౌతికసృష్టితోనుండుటం బట్టి ప్రకృతియొక్క స్వాభావికమును, త్రిగుణాత్మకము నగు చేష్ట ననుసరించి గ్రహములు మున్నగువాని గతులయందుఁ గూడ వరుసగాఁ బరివర్తనమగుట స్వతస్సిద్ధమై యున్నది. ప్రతి శతాబ్దియందు గ్రహనక్షత్రముల గతులలో విపర్యయము గలుగుట సంభవించును. అట్టిదోషము దూరీకరించుటకు రెండుపాయములుగలవు. (౧) యోగదృష్టిసహాయము. (దీనివిషయము యోగదర్శనమందుఁ దృతీయాధ్యాయములోఁ జక్కఁగా జెప్పఁబడినది.) (౨) లౌకికబుద్ధిమూలమున యంత్రాలయ నిర్మాణ పూర్వకమగు దృగ్గణితపు సహాయము. మొదటిదగు యోగ దృష్టిసహాయ మీకాలములో బొత్తుగా లేదనియే చెప్పవచ్చును. మొట్టమొదట మనయార్యజాతియందే జ్యోతిశాస్త్రము పుట్టినది. ఇందు సందియముగూడఁ గలదా? లేదు. ఎందులకనఁగా ఇది వేదాంగమై యున్నది. మఱియుఁ బరంపరగా నీ శాస్త్రి జ్ఞానము మన భరతఖండమునుండియే యితర దేశములకు వ్యాపించియున్నది. ఇప్పుడుద్యమశీలురగు పాశ్చాత్యజాతుల వారిందు విశేషోన్నతిని జూపియున్నారు. పాశ్చాత్యపండిత ప్రకాండు లీ సమయమున జ్యోతిష యంత్రాలయములను

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

స్థాపించెడి విషయములోను, దృగ్గణితపుసహాయమువలన గణిత జ్యోతిషమును సంస్కరించు విషయములోను మిక్కిలి వృద్ధిని బొందియున్నారు. వారిగణితము ప్రత్యక్షముగా ఫలప్రదమగుటకుఁ బ్రారంభించినది. ఆర్యజాతియం దనేక విప్లవములు, ననేక దురదృష్ట స్థితులు గలిగిన కారణముచేతఁ గొన్ని శతాబ్దులనుండి గణితజ్యోతిషమునకు సారణీసంస్కారము జరిగియుండలేదు. ఈ కారణముచేత భరతవర్షమందు జ్యోతిష యంత్రాలయములను స్థాపించి వానిమూలమున మన ప్రాచీన గ్రంథములయుఁ బాశ్చాత్యజాతులవారి నవీన దృగ్గణిత శైలి యొక్కయు సహాయముతో నీశాస్త్రము వృద్ధిజెందుటకుఁ బ్రయత్నించినచోఁ దప్పక ఫలప్రదముగాఁ గలదు. నేఁటికాలమున, జ్యోతిశ్శాస్త్రతత్వము నెఱుంగకపోవుటచే,ఫలితజ్యోతిష యాథార్థ్యమునందే మిక్కిలి సందేహములు గలుగుచున్నవి.

—◯(ఫలితజ్యోతిషము సత్యమా? కాదా?)◯—

కర్మమూలముననే జీవులకు సుఖదుఃఖములు గలుగుచున్నప్పుడుజడగ్రహసంబంధ మొక దానిని బెట్టి జన్మపత్రికను వ్రాసి గృహస్థులను సుఖదుఃఖము లనెడి చిక్కులలోఁ జిక్కించుట యొదులకు? ఇట్లు చేయుటయన్నివిధములను నింద్యమైయున్నది. అను మున్నగు విశేషము లనేకములు గల్గుచున్నవి. అందువలన నీవిషయములు విచారింపఁదగినవి. గ్రహములుజడములా?

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

కావా? యనువిషయమును విచారింపవలసిన యవసరమిప్పట్టున్ఁ గస్పట్టను. అట్లయినను హిందూశాస్త్రముల మార్మిక సిద్ధాంతముల నెఱిఁగెడిబుద్ధిమంతులు జడపదార్థము నిష్క్రియ మనియు నత్తెఱఁ నీ భువనమం దెన్ని జడపదార్థములు కార్య ములను జేయుచున్నట్లు కనుపడుచున్నవో వానిలో నేదో యొక చేతనసత్త యవశ్యముండితీరుననియు దానిమూలముననే దానికి నిర్ణీతమైన కార్యములు జరుగుచుండుననియుఁ దప్పక యంగీకరింపఁగలరు. ప్రకృతి జడము. అట్లయినను దానియందుఁ జేతనస్వరూపమగు పరమాత్మ యుండుటచేతనే యా ప్రకృతి నియమబద్ధములగు కార్యములను గావింప సమర్థమగుచున్నది. అట్లు గానిచో నంధగతిగాఁ గార్యములు జరుగును. మఱియు సృష్టి, స్థితి, ప్రలయముల ధారాప్రవాహము క్రమముగా నుండనేరదు. ఎట్లనఁగా, క్రమపరివర్తనమును, గార్యపరంపరయుఁ · చైతన్యశక్తి యొక్క యునికినే సూచించుచున్నవి. ప్రకృతిలోఁ బరమాత్మ యుండనిచో సృష్టిపరాయణ యగు ప్రకృతి యెల్లప్పుడు సృష్టినే కావించుచుండెడిది; ఎప్పటికినిఁ బ్రలయము గాకుండెడిది; ఒకవేళ నేదోరీతిగాఁ బ్రలయము గలుగుట సంభవించినను నవిచ్ఛిన్నముగాఁ బ్రలయమే యుండెడిది. అందుఁ బరివర్తనము గలుగఁజాలదు. ఏలయన. జడశక్తి బల సంఘబలము. దానియందు భావాంతరముగాని · క్రమము

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

గానియుండఁజాలదు. ధూమశకటము (రైలు)యొక్క ప్రవర్తక (ఇంజను) మందు బండిని లాగెడి బలమున్నది. కాని చేతన రూపియైన చోదకుఁడు (డ్రైవరు) లేనిచో నా ప్రవర్తకము లాగుచునే యుండును. ఒకప్పుడుగూడ నా ధూమశకటము నిలువఁజాలదు. ఇట్లే యన్నివిషయములందును గ్రహింపవలయును. మఱియు నిట్టి విజ్ఞానము మీఁదనే హిందూశాస్త్రములలో దైవీమహిమ ప్రతిష్ఠింపఁ బడినది. అనఁగా నెన్ని జడ పదార్థములు గలవో వానికన్నిఁటికిఁ జాలకములు (నడిపెడివి) ప్రత్యేక ప్రత్యేకముగాఁ జేతన శక్తులు కల్పింపఁబడినవి. ఈ శక్తులే దేవతలని యనఁబడుచున్నవి. అట్టి సంచాలనకారిణి యగు చేతనశక్తి మూలమున జడపదార్థములందుఁ జక్కఁగా నియమితములగు కార్యములు జరుగుచున్నవి. అట్లు లేనిచోఁ బ్రకృతి కేకార్యమునందుఁగూడ నియమము లేకుండనుండును. ఈ శక్తులన్నియు భగవచ్ఛక్తియే యని యవశ్య మెఱుంగవలెను. ఎందులకన. అణనిశక్తి గాక జడ, చేతనాత్మకమైన జగమునందు మఱియొక శక్తియుండదుగదా. ఏది సమస్త ప్రపంచమును రక్షించి నియమితక్రియలయందు సంచరింపఁ చేయఁగలదో యట్టి భగవచ్ఛక్తియే జడపదార్థములో జడశక్తి రూపముగాను, మనుష్యులలో మానసీయ వివిధశక్తిరూపము గాను, దైవలోకమునందును, గ్రహాదికమునందును దైవత

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

రూపముగానో యాసురరూపముగానో, జ్ఞానరాజ్యములో నార్షశక్తిరూపముగాను, మఱియు నాధిభౌతిక ప్రకృతిలోఁ బైతృకశక్తి రూపముగాను బ్రకాశించుచున్నది. జలములోపల నే చేతనశక్తి యుండుటచేత విశ్వప్రకృతిలో నంతర్వ్యాప్తమగు జలసంబంధముగల రస మెల్లయెడల మిక్కిలి చక్కఁగా నక్కఱకు వచ్చుచున్నదో దానికి "వరుణదేవుఁ" డని పేరు. వాయువునం దే చేతనశక్తియుండుటచేత బ్రహ్మాండమును వ్యాపించెడి వాయువుమూలమున జీవులకుఁ బ్రాణరక్షణ మగుచున్నదో దానికి "పవనదేవుఁ" డని నామము. ఇట్లే భూమియం దే చేతనశక్తియుండుటచేత నది వసుంధరయు, సుజలయు, సుఫలయు, సస్యశ్యామలయునై సర్వ ప్రపంచమం దలి జీవులను రక్షింపఁ జాలుచున్నదో దానికి "పృథ్వీమాత" యని నామధేయము. ఇట్లే యితరగ్రహములందుఁ గూడ నెఱుఁగవలెను. అనఁగా నాయాగ్రహములలోఁ జేతనశక్తి యుండుటచేతనే వానిలో నున్న జీవుల సంరక్షణమగును. అట్లు లేనిచోఁ గానేరదు. ఇదియే యాస్తికములగు హిందూశాస్త్రముల సిద్ధాంతము. దీనినింతవఱకుఁ బాశ్చాత్య పండితులు గుర్తెఱిఁగి యుండలేదు. ఏలయనఁగా, వారిదృష్టిస్థూలపదార్థములపై బద్ధమైయుండును. అంతర్దృష్టిగాని, యోగదృష్టిగాని వారికి లేనే లేదు. మఱియు భరతఖండమునకుఁ బట్టిన దురదృష్టము వలన మన హిందూవుల

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

సంతతియందుఁ గూడ నీజ్ఞానము దినదినము క్షీణించిపోవు చున్నది. ఇప్పు డీ గ్రహములతో నుపగ్రహములతో జీవుల కెట్టి సంబంధమున్నదో యది తెలుపఁబడును.

భౌతికజగత్తు (స్థూలప్రపంచము) సూక్ష్మముయొక్క విస్తారరూపమైనందువలన సూక్ష్మశక్తి ఘనీభావమే స్థూలశక్తి రూపముగాఁ బ్రకటమగుచున్నది. ఇట్టిసిద్ధాంతము పాశ్చాత్యుల చేతఁగూడఁ జేయఁబడినది. అనంతమును, శూన్యమునగు నాకాశములో విరాట్పురుషుని గర్భమం దనంతకోటిగ్రహములు నుపగ్రహములు, సూర్యచంద్రాదులు, నక్షత్రములు మున్నగు నవి తమతమ కక్షలయందు నియతముగాఁ దిరుగుచుండుటలోఁ గూడ నీవిశ్వవ్యాపినియైనశక్తియే పనిజేయుచున్నది. ఒక్కొక్క గ్రహముయొక్కయు, నుపగ్రహముయొక్కయు లోపల నాక ర్షణ వికర్షణములనెడి పరస్పరవిరుద్ధశక్తులు రెండున్నవి. ఆకర్ష ణశక్తిమూలమునఁ బదార్థములు పరస్పర మాకర్షింపఁబడుచు న్నవి. వికర్షణశక్తిమూలమునఁబరస్పరము విడివడిపోవుచున్నవి. వీనిలోనొకదానివలనఁగాని యొకదాని యుద్రేకమువలననేకాని ప్రపంచమురక్షింపఁబడఁజాలదు. స్థితిదశ, రెండుశక్తులసామంజస్య ఫలమేయైయున్నది. అందువలనగ్రహములలోఁబరస్పరమాకర్షణ వికర్షణములుగలవని సిద్ధాంతమైనది. గ్రహములు, నుపగ్రహ ములును బరస్పర మాకర్షణవికర్షణములు గావించుచున్నప్పు

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

డవ్వానిలోనున్న జీవులపైఁ గూడ నాయాకర్షణముయొక్కఁ గాని, వికర్షణముయొక్కఁ గాని క్రియల ప్రభావము గలుగఁగలదు. ఇందు సందియమేమియులేదు. పృథివీగ్రహము మధ్యాకర్షణ శక్తిగలదనియు, దానిమూలమున సమస్తజీవులను బృథ్వీమాత యాకర్షించుచున్నదనియు, సందఱెఱింగినదియే. భూమి, యొక మిక్కిలి గొప్పయయస్కాంత(సూదంటుఱాయి) మనితలఁపుడు. దీనిశక్తియుత్తరపువైపునుండి ప్రసరించుచుండును. ఇట్లేయితరములగు గ్రహములలోను, నుపగ్రహములలోను, మఱియు జ్యోతిషమునకు సంబంధించిన వివిధగ్రహాదులలోను దెలిసికొందురుగాక. ప్రకృతిలోపల నండము మొదలుకొని బ్రహ్మాండమువఱకు నేదిగూడ నీయాకర్షణ వికర్షణ శృంఖలనుండి తప్పించుకొనినది లేదు. ఎందులకనఁగా? మూలమగు మహాకర్షణ శక్తి సర్వశక్తిసంపన్నుండగు భగవంతుఁడైయున్నవాఁడు. ఈ పరమాత్మ, తనవైపున కీసర్వప్రపంచము నాకర్షించుచున్నాఁడు. ఇందువలననేకదా "హరి, కృష్ణ" నామములు గలిగినవి. అతని మహాకర్షణమే ప్రపంచమందొకచో మధ్యాకర్షణముగాను, మఱియొకచోఁ జుంబకాకర్షణముగాను వేఱొకచో నాకర్షణ వికర్షణములు మున్నగురూపములుగాను బ్రచారములోనున్నది. ఈస్థూలమగు నాకర్షణవికర్షణములే సూక్ష్మరాజ్యము (మనోరాజ్యము) లోనికివచ్చి రాగద్వేషరూపముగామాఱుచుండును.

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

ఎందాఁక జీవుఁడు ప్రకృతికి సంబంధించిన యాకర్షణ, వికర్షణ ములలో నుండునో యందాఁక నతనికి జీవత్వమును, వైషయిక భావమును గలిగియుండును. ఎత్తఱి జీవుఁడు ప్రాకృతిక సమస్తాకర్షణ వికర్షణముల మూలమందు భగవాను నిని సర్వశక్త్యాత్మకమగు మహాకర్షణశక్తిని ననుభవించునో యప్పుడే సంసారమందు విరక్తిని, బొంది భక్తిమార్గ మవలంబించి దానిమూలమున ముక్తుఁడు గాఁగలఁడు. ఈ తత్త్వ మంతయు భక్తిశాస్త్రమునకు సంబంధించినదగుటంబట్టి భక్తిని గూర్చి వ్రాయుస్థలమందుఁ జూపఁగలము. దీనింబట్టి గ్రహములు, నుపగ్రహములు నాఱియు జ్యోతిర్మండలమం దుండు సూర్యుఁడు, చంద్రుఁడు, మొదలగువాని నన్నిఁటితో జీవ మాత్రమున కాకర్షణవికర్షణసంబంధము ప్రాకృతికరూపముగాఁ గలిగియున్నదని సిద్ధాంతమైనది. ఈ యాకర్షణ వికర్షణముల తారతమ్యము గ్రహోపగ్రహముల కక్షలలో వానివానియునికి తారతమ్యము ననుసరించినదై యుండును. దీనిని దృష్టాంత రూపముగాఁ దెలిపెదము. చంద్రునితోడ భూమికిని భూమిలో నున్న యెల్ల జీవులకు నాకర్షణ సంబంధము గలదు. ఈ యాకర్షణ మెల్లప్పుడున్నను బూర్ణిమాదినమందుఁ జంద్రుఁడు మిక్కిలి దగ్గరగా నుండుటచేత నత్యంత మధికమగుచున్నది.



CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

దానివలన సముద్రజల ముప్పొంగును. మనుష్యుల శరీరము నందును మనస్సునందును భావాంతరము గలుగును. ఈవిషయ మందు తెలిసిగినదియే సుమీ. స్థూలాకర్షణము శరీరముపై నగును. అందువలనఁ బున్నమనాఁ డుపవాస వ్రతాదులను గావింపవలసినదిగా మహర్షులచే వ్రాయఁబడినది. అట్లుగానిచో రసాధిక్య యుక్తమగు శరీరముపై నాకర్షణ మున్నందు వలన మానసిక ప్రేమ, చాంచల్యము, మున్నగునవి పూర్ణిమాదిన మందు స్వభావముగానే కలుగుచున్నది. ఇందుకొఱకే యధికా కర్షణప్రభావము చిత్తముపైఁబడి దాని కవనతి గలుగకుండు నట్లు వ్రతము, నియమము, భగవద్ధ్యానము మున్నగు విధు లా పున్నమనాఁడు నెరవేర్పవలసినదిగా ఋషులచే విధింపఁ బడినవి. ఇట్లే యితరములగు గ్రహోపగ్రహములతోఁ గూడ నాకర్షణ సంబంధము గలదని తెలియవలెను. ఇఁకఁ గర్మ విషయమును గూర్చి విచారింపఁబడుచున్నది.

మనుష్యుని శరీరము ప్రారబ్ధకర్మమును బట్టియే పుట్టు చున్నది. పూర్వజన్మములలోఁ జేసిన కర్మములలో నుండి బలవత్తరమును, ఫలోన్ముఖమునగు కర్మము, ప్రారబ్ధమైజీవునకు స్థూలదేహము గల్గించుచున్నది. ప్రారబ్ధకర్మము ననుసరించియే నరునకుఁ దారిద్ర్యముఁ దల్లియు సంభవించుచుందురు. జాత్యా

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

యురోభోగాదులన్నియుఁ బ్రారబ్ధ కర్మముచేఁ గలిగిన ఫలములై యున్నవి. యోగదర్శనమం దిట్లు వ్రాయఁబడియున్నది.

"సతిమూలే తద్విపాకో జాత్యాయుర్భోగాః"

ప్రారబ్ధకర్మము మూలమందుండుటవలన బ్రాహ్మణ క్షత్రియాది జాతియు, ఆయువు, భోగములును, దాని పరిణామ రూపముగాఁ గలుగుచున్నవి. ఎప్పుడు కర్మమునకు సంబంధము శరీరముతో నైనదో మఱియు నెప్పుడు గ్రహములకుఁ గూడఁ బ్రాకృతికమగు నాకర్షణ వికర్షణ సంబంధము దేహముతో నైనదో యప్పుడు ప్రారబ్ధకర్మము ననుసరించి జనని జనన సమయమందు గ్రహములయు, నుపగ్రహములయు స్థితి సమము గానో విషమముగానో కాఁగలదు. సందియ మిందేమియు లేదు. ఎవని ప్రారబ్ధకర్మ మెట్లున్నదో వాని జన్మసమయమందు గ్రహోపగ్రహముల యనుకూల స్థితియో, ప్రతికూల స్థితియో చక్కఁగా వాని కర్మసంబంధము ననుసరించి నభోమార్గమం దుండఁగలదు. మఱియు నాకర్షణ వికర్షణ ప్రభావముగూడ నిట్లే యుండఁగలదు. ఇందు సందేహము లేదు. అందువలన నెవరు కేవలము కర్మమును మాత్రమే యొప్పుకొని గ్రహోప గ్రహముల సంబంధమును దోసిరాజంతురో వారు ప్రమాద వశులై యున్నారు. ఎందులకనఁగా, కర్మమునే యనుసరించి జీవులతోఁ బ్రాకృతికమగు నాకర్షణ వికర్షణ సంబంధము గల్గిన

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

గ్రహోపగ్రహస్థితి, పుట్టినదిమొదలు గిట్టువఱకు నుండఁగలదు. వెండియుఁ గర్మపరివర్తనము ననుసరించి యా గ్రహోపగ్రహ ములస్థితియందును, ప్రభావములందును, మార్పులగుచుండును. ఎత్తెఱిఁగారాంతికులు గ్రహోపగ్రహ విషయము గణితవిద్యా మూలమున సర్వము నెఱుఁగఁ జాలుచున్నారో యత్తెఱి నేగ్రహ మెచ్చట నున్నందువలన నేకర్మము ప్రబలమో, యేది దుర్బలమో యీ విషయముగూడ వారు వచింపఁ జాలుదురు. ఇందు సందేహములేదు. ఎందులకనఁగా? కర్మముతోఁ గాయము నకుఁ, గాయముతో గ్రహములకు సంబంధమున్నది. ఇఁక నిప్పుడు గ్రహశాంతి కేమిప్రయోజనమున్నదో యేమిసంబంధ మున్నదో యది దెల్పఁబడుచున్నది.

కర్మము నష్టముగాకపోయినను గూడ మంచిపనివలనఁ జెడ్డపని యణఁగఁ ద్రొక్కఁబడునను విషయము విజ్ఞానసిద్ధ మైనది. అందువలన నేమనుష్యునికైన నేప్రారబ్ధకర్మమో యే చేయుచున్న ప్రబలకర్మమో చెడ్డదైనప్పుడు వాని గ్రహము గూడ నాకర్మము ననుసరించి మందముగా నుండఁగలదు. అనఁగా నేస్థానము దా గ్రహము వాని కర్మము ననుసరించి యుండునో యాస్థానమునుండి వాని శరీరముమీఁదనో మనసు మైననో యాకర్షణ వికర్షణకార్యములు మందముగా నగు చుండును. ఇప్పుడు చెడ్డకర్మము నణఁగించెడి నేయనుష్ఠానమైన

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

నేక్రియయైన యున్నట్లైతే చెడ్డకర్మము నణఁగించినందువలన దాని గ్రహముగూడ శాంతిని బొందఁగలదనుమాట దప్పక పాటింపఁ దగినది. అనఁగా మందమగు కర్మము ననుసరించి యే గ్రహమున నాకర్షణవికర్షణప్రభావ మశుభముగా నుండునో యదిచక్కఁబడఁగలదు. ఇదియే గ్రహశాంతితత్వము. ఫలిత జ్యోతిషమందలి యీ తత్వ మెఱుంగఁజాలక యజ్ఞులగు జనులు విశేషముగాఁ గోలాహలముఁజేయుచున్నారు. మఱియు వారు పాండిత్యాభిమానముచే నున్మత్తులై గ్రహముల నామములలోని ధాత్వర్థములను విపరీతము గావించి యేమేమో చేసివేయుచున్నారు. కాని పండితులై విచారించిన యెడల యథార్థతత్వము విదితముకాఁగలదు. నొడియు వేదోక్త మగు నా శాంతిపాఠమునకుఁ గాని, శాంతిక్రియలకుఁ గాని యున్న చక్కని తాత్పర్యము మనోహరముగా నుండఁగలదు. అథర్వవేదమం దిట్లు వ్రాయఁబడినది.

"శన్నోగ్రహాశ్చాంద్ర మసాశ్చాదిత్యాశ్చరాహుణా"

"శన్నో మిత్ర శ్శం వరుణ శ్శం వివస్వాన్"

"ఆరేవతీచాశ్వయుజౌభగంను ఆమేరయింభరణ్యా ఆవహన్తు"

గ్రహములు, సూర్యుఁడు, చంద్రుఁడు, రాహువును నాకు శాంతిప్రదాతలగుదురుకాక. మిత్రుఁడు, వరుణుఁడు,వివస్వంతుఁడును నాకు శుభమును గల్గింతురుగాక. రేవతి, అశ్వని, భరణి

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

మున్న.గునవి నా నైశ్వర్యఘనము లొసంగునుగాక. ఇటువంటి యనేకశాంతిమూలకమంత్రములు వేదమునందు లభించుచున్నవి. ఇట్లే యబ్దేవతనుగుఱించి గూడ శాంతిగలదు. అబ్దేవత దైవీజగత్తునకుఁ దామసికశక్తులై యున్నది. ఏప్రకారముగా గ్రహములకు స్వాభావికసంబంధము జీవులతోఁగూడనున్నదో యాప్రకారమా సర్వతామసికశక్తుల సంబంధము తామసికకార్యసహితప్రకృతికిఁగూడ నున్నది. ఏలయనఁగా, రెండుగూడఁ దామసికములైనందునఁ బ్రాకృతికసంబంధమగును. అందువలన మనుష్యుని ప్రారబ్ధకర్మముగాని, బలవత్తరమగు క్రియమాణకార్యముగాని యసత్తైనచో (దామసికమైనచో) నా సర్వశక్తులును మనుష్యునిపై నత్యాచారములఁ జేయఁజాలును. ఈ యత్యాచారములకుశాంతి గ్రహశాంతివలె దివ్యమగు సాత్వికకర్మమునో, యనుష్ఠానమునోఁ చేసినందువలనఁగాఁగలదు. ఎందులకనఁగా, ఇతఃపూర్వము వచింపఁబడిన విజ్ఞానానుసారముగా మంచికర్మ వలనఁ జెడ్డకర్మ మణఁగును. చెడ్డకర్మమణఁగినందునఁ దామసికశక్తుల ప్రభావము జీవులపైఁబడఁజాలదు. ఇట్లబ్దేవతా పిశాచాదులకుఁగూడ శాంతి వేదమునందు వ్రాయఁబడినది.

"నతద్రక్షాంసి నపిశాచాశ్చరన్తి దేవానామోజః ప్రథమజంహ్యేతత్ యోబిభర్తి దాక్షాయణం హిరణ్యం సదేవేషుకృణుతే దీర్ఘమాయు ష్సమనుష్యేషు కృణుతే దీర్ఘమాయుః"

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

ఎవరు సువర్ణమును ధరించుచున్నారో వారిని రాక్ష సులుగాని, పిశాచములుగాని పట్టఁజాలవు. ఈ సువర్ణము దేవ తల మొదటి తేజమైయున్నది. ఈ "దాక్షాయణతేజము" నెవఁడు ధరింతురో వారు దేవలోకమందును, మనుష్య లోకమం దును వేయేల సకల ప్రదేశములందుఁగూడ దీర్ఘాయుష్మం తులు గాఁగలరు. ఇప్పు డీసర్వతామసిక కర్మములను దూరీక రించుటకై యేసాత్వికానుష్ఠానము గాఁదగి యున్నదో యద్దా నిని జేయువారు లేకున్నప్పటికి నాచేయువారలును వంచకులో ధూర్తులో, స్వార్థపరులో, బందిపోటు దొంగలో యైనప్పటికి నీ దోషము శాస్త్రము మీఁదికి రాఁజాలదు. ప్రస్తుతకాల మందుఁ గ్రియాకాండము జేయించెడి వంచకుల దృష్టాంతము లను విశేషముగాఁ జూపి శాస్త్రమును ఖండించుచున్నారు. ఇది సర్వవిధముల వారి ప్రమాదమై యున్నది. ప్రపంచమందు నాస్తికులున్నప్పటికిఁగూడఁ బరమేశ్వరుని యాస్తిక్యము నష్టము గానేరదు. వాని సత్త యట్లేనిల్చియుండును. కాఁబట్టి క్రియకుఁ గాని, యనుష్ఠానమునకుఁగాని, ఫలము మంచిదిగాకపోయినను, వంచకులు ప్రపంచమును లూటీజేసి మ్రింగుచున్నప్పుడును శాస్త్రములను ద్రోసివేయక యామోసగాండ్రనుబట్టి శిక్షింప వలయును. వారిని సంఘమునుండి బహిష్కరింపవలెను. మఱియు మంచి పురోహితుల నేర్పాటు జేసికొనవలెను.

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

ఇదియే కర్తవ్యము. ఇట్టి వాచకుల దోషము మఱియొకదాని (శాస్త్రము) పై వేయుట బుద్ధిమంతుని లక్షణముగాని మంచి యాలోచనము గాని కానేరదు.

ఇట్లే ఫలితజ్యోతిషములోని జన్మపత్రిక మున్నగువాని ఫలములు సరిగా ననుభవములోనికి రాకపోవచ్చును. దీనిచే ఫలితజ్యోతిష మసత్యముగాఁ జాలదు. ఇట్టి సిద్ధాంత మొనర్చుటయు లేనిపోని కోలాహలమునుబుట్టించి మనుష్యుల మానసములం దజ్ఞాన ప్రభావము పడవేయుటయు ధార్మిక ప్రపంచమునందుమహాపాపముసుమీ. గ్రహోపగ్రహములతో జీవునకు నట్లే ధర్మమునకు నేసంబంధమున్నదో యది యిది వఱకే చెప్పఁబడినది. దానిని విచారించిన యెడల ఫలితజ్యోతిష మొదలి సత్యత బోధపడఁగలదు. ఇప్పుడు విచారణీయాంశ మేమనఁగా, గ్రహముల యాకర్షణమును, గర్మముతో వానికిఁ గల సంబంధమును జక్కఁగా నున్నప్పుడు జన్మపత్రికయందుఁ బొరపాటు రాఁగూడదుగదా. ఇఁకెందులకిప్పుడు జన్మపత్రిక యసత్య మగుచున్నదనునది. దానియందుఁ బొరపాటు బడుట కెన్నియో కారణములున్నవి. అవిచూపఁబడుచున్నవి. మొదటి కారణమేమన? నేఁటికాలమున జ్యోతిశ్శాస్త్ర మెఱింగిన యోగ్యులే మిక్కిలి తక్కువగా నున్నారు. సమర్థులుగాని పండితులవలన నిట్లు జన్మపత్రము వ్రాయించినమీఁదఁ బ్రమా

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

దములే మైతీరును. మఱియు జన్మపత్రము శోకపత్రము గాఁగలదు. సందియ మిందేందులకు? ఇఁక జన్మపత్రిక వ్రాయు వారి మూర్ఖతాదోషము ఫలితదోషమున కంటఁగట్టఁగూడదు. ధూర్తులు వంచకులునగు కొందఱు జ్యోతిషజ్ఞానమనుమిషతో డబ్బు సంపాదించినట్లయితే యిప్పు డింతమాత్రముచే ఫలిత జ్యోతిషశాస్త్ర మసత్యము గానేరదు, చేయఁదగినపనియేమన, ఆవంచకుల నందఱిని బహిష్కరించి శాస్త్రమును యథార్థ విద్వాంసులకు హస్తగత మొనరించి వారిచే సర్వకార్యముల జేయింపవలెను. రెండవకారణ మేమన,జన్మకాలము దేహూరలో నేగడియలో, నేవిగడియలో, నేలిప్తలో, నేవిలిప్తలో బాల కుఁడు భూమిపైఁ బడుచున్నాఁడో దానిని గృహస్థులు చక్కఁగా విచారించి చూడరు. కొన్ని కారణములవలన రెండు మూఁడు నిమిషము లటునిటు హెచ్చుతచ్చులయినచో గ్రహ ముల స్థానములయందు మిక్కిలి మార్పులు గలుగుచున్నందు నను, మఱియు నీ భ్రమమయమైన సమయము ననుసరించి జన్మపత్రము వ్రాయఁబడుటవలనను, జన్మపత్ర మసత్యమగు చున్నది. ఈదోషము గృహస్థులది. ఫలితజ్యోతిషముది గాదు. మూఁడు నాల్గు కారణములు దొలుతనే చెప్పఁబడినవి. ఎట్లంటి శేని (మూఁడవకారణము) జ్యోతిషశాస్త్రములోని చాలగ్రంథ



CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

ములు లోపించి పోయినవి. మఱియు లెక్క (గణితము)గూడఁ దప్పుచున్నది. (నాల్గవకారణము) ప్రాకృతికమగు పరివర్తనము ననుసరించి గ్రహములగతిలోఁగూడఁ బరివర్తనమైనది. దీనిని జక్కఁగాఁ దెలిసికొనవలయునని యిచ్ఛ యున్నచో యోగ శక్తిసాహాయ్యమో, దృగ్గణిత సాహాయ్యమో కావలయును. ఆ రెండుశక్తులు నేఁటికాలమునందు లేవు. కాఁబట్టి ఫలితజ్యోతిష ముపై దోషమారోపింపక దానిని సంస్కరింపవలయును. ధనవంతులగువారు. వ్యర్థముగా రూపాయలను వ్యయపరచక యిట్టికార్యమునం దుపయోగింపవలెను. యంత్రాలయములు మున్నగునవి స్థాపింపవలయును. పాండిత్యగర్వగర్వితులగు వారు తమ మెదడును, శాస్త్రమును బీకిపారవేయుటయందు వమ్ముచేయక శాస్త్రమున కిప్పుడు పట్టిన దుర్దశలను దొలఁ గించి యా శాస్త్రము చక్కఁబడు పనియందు వినియోగింప వలెను. ఇట్లుచేసినయెడల భారతదేశభాగ్యము సుప్రసన్నము గాఁగలదు. మఱియు జన్మపత్రముగూడ శోకపత్రముగాక యథార్థజన్మపత్రము గాఁగలదు.

అపౌరుషేయంబగు వేదమునందలి గంభీరార్థము నెఱుం గుటకే ప్రకారముగా నాఱువేదాంగముల తత్వనిర్ణయమును, దాని సమ్యక్పరిజ్ఞాన మత్యంతావశ్యకము లైనవి. సందేహమిందు లేదు. ఈ షడంగములను జక్కఁగా గుర్తెఱుంగనియెడల వేద

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

పారావారమునందుఁ బ్రవేశించుట యసంభవమగును. ప్రాచీన కాలమందీ షడంగములును సమానరూపముగా నుత్తమరీతిని బోధింపఁబడుచుండెడివి. ఇందు మన వైదికజ్ఞానలాభము గలిగించుటయందుఁ బ్రజలు సమర్థులైయుండిరి. ఇప్పుడీ షడంగముల లోని మంచిగ్రంథములు దఱుచుగాఁ జిక్కుటయే లేదు. వీని యథావచ్ఛిక్ష వేదార్థబోధ కుపయోగపడనందువలన నీ సమయమున నిలిచియున్న వేదములుగూడ దుర్జ్ఞేయము లగుచున్నవి. పైనఁజెప్పఁబడిన షట్శాస్త్రములు వేదముల కంగములని చెప్పఁబడును. మఱియు వైదికములగు సప్తదర్శనశాస్త్రములు వేదమున కుపాంగములని వ్యవహరింపఁబడును. వేదాంగములమూలమున వేదబహిస్స్వరూపము, వేదములోని క్రియాశక్తి, తత్క్రియాశక్తితోఁగూడ సూక్ష్మరాజ్యసంబంధమును జూపించి వైదికజ్ఞానమును గల్గించుటయందుఁ దోడ్పాటు గాఁగలదు. రెండియు వేదోపాంగములు జిజ్ఞాసుని యంతరాజ్యమును బరిశుద్ధమొనర్చి వాని బుద్ధితత్వమున కున్నతి గలిగించుచు నతనికి వేదోదితమగు నాధ్యాత్మికజ్ఞానలాభము జేకూర్చును. వేదాంగములను బఠింపకుండ వేదమందుఁ బ్రవేశించుట యసంభవము.

శిక్షాశాస్త్రము, స్థూలము, నశ్వరమయమునైన వేదమందలి స్థూలశక్తిని నున్నదున్నట్లుగాఁ బ్రకాశపరచెడి క్రమ

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

మును శైలినిజూపించి యా వేదముయొక్క యథార్థస్వరూపమును బ్రకటించుటయందుఁ బరిపూర్ణముగా సహాయమొనర్చుచున్నది.

కల్పశాస్త్రము వేదోక్తమగు క్రియాకలాపముయొక్క రహస్యమును, వైదిక కర్మకాండమునందలి సక్రమపద్ధతిని నేర్పి వైదిక క్రియాశక్తికిఁ బూర్ణత్వమును గల్గించుచున్నది.

వ్యాకరణశాస్త్రము, వేదోక్తమగు నక్షరయోజన, యోజనాక్రమమును, యోజనాక్రమముచే నక్షరార్థనిర్ణయమును గావించి వేదములోఁ బ్రవేశించుటకు ద్వారముఁ దెఱచుచున్నది.

నిరుక్తశాస్త్రము, వేదోక్తశబ్దములవలన వేదసమ్మతములగు రహస్యములను జూపి శబ్దసహాయముతో ననాదియు, ననంతము, నలౌకికమునగు భావరాజ్యములో జిజ్ఞాసుని బ్రవేశింపఁజేయుచున్నది.

ఛందశ్శాస్త్రము, సాధారణముగా వేదమయములగు ఋక్కులలో నియంతర్నిహితమగు దైవీశక్తిజాడఁ గనుఁగొని దాని మూలమున దైవీకార్యములను గ్రహించుటకు శక్తిఁ జూపించి దానిని బ్రయోగించుటకు దైవీమార్గమును గన్పరచుచున్నది.

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

జ్యోతిషశాస్త్రము సాధకునకు జగదాధారరూపియగు కాలముయొక్క స్వరూపజ్ఞానమొసరించి కాలసేవారీతిఁ గన్పరచుచు నా వేదోక్తసాధనాపులందు సఫలీకృత మనోరథుఁడగు యోగ్యతను గల్గించుచున్నది.

ఈ కారణమునుబట్టియే వేదములోని యీ యాఱంగములు లేకుండఁబూర్ణాధికారప్రాప్తియు వేదపారావారములోఁ బ్రవేశింపఁదలఁచుటయు దురాశామాత్రములని తెలిసికొందురుగాక.

శ్లో॥ స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయేనమార్గేణ మహీంమహీశాః
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినోభవంతు॥

శ్రీచిపుకుల అప్పయ్యశాస్త్రిచే రచింపఁబడిన
వేదవేదాంగచంద్రిక యను గ్రంథము
సంపూర్ణము.

శ్రీ కృష్ణార్పణమస్తు.



శికిందాబ్రాదు:-శ్రీబాలాత్రిపురసుందరీ ముద్రాలయమున ముద్రితము.

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

# శ్రీ గర్గ భాగవతము

(మహాకవిశిరోమణి చివుకుల అప్పయ్యశాస్త్రి విరచితము.)

శ్రీకృష్ణుని గురువగు శ్రీగర్గాచార్యులవారిచే సంస్కృతమునందు రచింపఁబడిన గర్గసంహిత కిది యాంధ్రీకరణము. ఇందు శ్రీభాగవత, శ్రీదేవీభాగవత, బ్రహ్మ, బ్రహ్మాండ, బ్రహ్మవైవర్తాది పురాణము లందులేని యనేక మనోహరకథలు గలవు. ఆంధ్రసాహిత్యపరిషత్, భారతి, త్రిలింగ, హిందూ బాంధవి, గోలకొండ, మొదలగు ఆంధ్రపత్రికలును, బండిత కవిచంద్రులును బ్రశంసించియున్నారు. నెల్లూరు జిల్లాబోర్డు, వంగోలుతాలూకాబోర్డులవారు గ్రంథాలయముల నిమిత్తమై యంగీకరించి గ్రహించియున్నవారు. ప్రతిమనుజుఁడును జదువఁదగిన గ్రంథరత్నము. క్రొత్తది. ఇందుఁ బారాయణయోగ్యమగు శ్రీకృష్ణదండకముఁ గలదు. మద్రాస్ టెక్సుబుక్కుకమిటీచే అంగీకరింపఁ బడినది.

దాదాపు ౬౦౦ పేజీలు గ్లేజు, రాయల్. వెల 3-0-0

## కవిపండితుల యభిప్రాయములు.

విద్వత్కవిచంద్రులగు బ్రహ్మశ్రీ శతావధాని చెళ్లపిళ్ళ వేంకటశాస్త్రులవారు. కడియము 8-11-26

ప్రాచీనకవుల శైలిగలిగి నిర్దుష్టమై మనోజ్ఞముగా నున్నయది... సర్వదా భగవంతుఁడు మీకిట్టి మహోత్కృష్ట గ్రంథ రచనకుఁ బ్రోత్సాహకుఁడై యశోభివృద్ధి కరుఁడగుగాక.

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

కావ్యస్మృతి తీర్థేత్యాది బిరుదాంకితులును

రామాయణ బ్రహ్మాండపురాణా ద్యనేకగ్రంథకర్తలునగు

బ్రి॥ జనమంచి శేషాద్రిశర్మగారు.

మహాకవిశిరోమణీ! కడప 7-11-1926

తమరుపంచిన శ్రీగర్గభాగవతముచేరినది. దానింగాంచి కరముహర్షించితిని. పట్టుదలంబూని యేంబదితావులం బఠించితి. శ్రీకృష్ణదివ్యచరితామృతమును గ్రోలి పరమానంద భరితస్వాంతుండ నైతిని... మీా యీకవిత్వము గంగాప్రవాహమువలె మనోజ్ఞముగ నున్నది. శైలి సులభతమమై సర్వజన సుబోధముగానున్నది. పద్యములు సరసజన హృద్యములై సొంపారుచున్నవి. ఏవిధమునం జూచినను మీాకవిత్వము ప్రాచీనమహాకవుల కవిత్వమునుబోలి పవిత్రమై మనోహరమై నిర్మలమై సేవింపం దగియున్నవి. ఈకాలమున నిట్టి సద్గ్రంథముల నంపును బురాణముల వ్రాయువారరుదుగ నున్నవారు. పరమభక్తిం బాటించి యీామహత్తర పురాణగాథలం దెనింగించి యుత్తమ శ్లోకులైతిరి... పరిశీలించిచూడ మీారుప్రాచీనకవుల పజ్త్తిలో వ్రాయందగినవారని త్రికరణశుద్ధిగా వచించుచున్నవాండను. శ్రీకృష్ణపరమాత్మకృతిం దెనింగించి పరమేశ్వరాంకిత మొనర్చి మీాజన్మమును సార్థకముగం జేసికొంటిరి. మిమ్ముల నుదాహరణముగాం గొని కవులిట్టి సద్గ్రంథముల విరచింతురుగాక. ఈ పురాణరత్నము మీాయశస్సును దశదిశలనింపి తెలుంగు భాషకు విఖ్యాతింగూర్చి తానలరుచు మిమ్ముల నలరింపం

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative

జేయునుగాక. భగవంతుఁడు శ్రీకృష్ణపరమాత్మ కరుణానీరధి మీకాయురారోగ్యములఁ బ్రసాదించి యిట్టి గ్రంథరత్నముల నింకను జేయు బుద్ధిఁబుట్టించి మిమ్ముఁగాపాడుగాకయని సాంద్ర భక్తిని శ్రీపరాత్పరుం బ్రార్థించుచున్నవాఁడను. కవిలోకము మీకు "మహాకవిశిరోమణి" యను బిరుదము నొసంగి గౌరవించుగాక.

ఈబిరుదము జనగాం పౌరపండిత మహాసభలోఁ గూడ దృఢపఱుపఁబడి యొసంగఁబడినది.

అష్టావధాని అల్లాడి జగన్నాథశాస్త్రి బి. ఎ. ఎల్. టి.
రాజాస్ హైస్కూల్ హెడ్‌మాస్టర్ వేంకటగిరిటౌన్.

1. శ్రీమాతయు సురనేతయు । కామేశ్వరి యంబయిచ్చు కానుకలిచటన్
శ్రీమచ్చివుకుల కులాబ్ధి । సోమున కప్పయ్యశాస్త్రి శుభనామునకున్॥

2. సమ్మతి నంబ నగ్గొనుత సారకవిత్వ ఘనత్వ సంపదా
ఢ్యమును తమ్మునన్ జివుకు లాబ్ధి భవాప్పయ పూర్ణచంద్రభా
గ్యమ్మును నాంధ్రవాక్ప్రియత మాభరణమ్మును గర్గసంహితా
ఖ్యమ్మగు గర్గభాగవత మారవి తారయశమ్ము శమ్మిడన్.

3. వినుమా శుకవిజ్ఞానం । బునచో తనభాగవతము ముదమిడుచుండన్
వినుమీ శుకవిజ్ఞానం । బున నూతనభాగవతము ముదమిడుగాదే॥

4. ఆర్యా! మీదగు గోపికావిరహ రాధాకృష్ణ వైవాహ మా
ధుర్యంబున్ ఖలదైత్యనాశచయ ప్రద్యుమ్నాఖిలాశా జయ
క్రౌర్యంబున్ బ్రతిఖండ మిత్తునిభమై రాజిల్ల శృంగార స
ద్వీర్యంబుల్స్మరియింపఁ జేయవె బుధుల్వేవేగ నప్పయ్యనన్!

5. భాగవత కవినాథ! మీపాదములకు । సద్ధిరాజునకిడ్డెడు సర్ఘ్యంబుమాడ్కి
పద్యపంచకమిదె భక్తి వ్రాసిపంపె నాడ్య [illegible]గు జగన్నాథశాస్త్రి॥

CC-0. Jangamwadi Math Collection, Varanasi. An eGangotri Initiative
LIBRARY
Jangamwadi Math, Varanasi
Acc. No. 813[illegible]

